

# ఇద్దరు మోసగత్తెలు

హారూన్ అల్ రషీద్ బగ్దాదులో ఖలీఫాగా వుండగా ఆయన రాజ్యమంతటా పావురాల టపా నడిచేది. దాన్ని నడిపినవాడు ఒక గొప్పవాడు. ఖలీఫా ఆయనను కొడుకు లాగా చూచుకోవటమే గాక ఆయనకు నెలకు వెయ్యి దీనారాలు జీతం ఇచ్చాడు.

కాలక్రమాన ఆయన చనిపోయాడు. పావురాల టపా అంతమయింది. ఆయన టపా నిమిత్తం ఉంచుకున్న పావురాలనూ, నలభైమంది నీగ్రో బానిసలనూ, నలభై వేటకుక్కలనూ ఖలీఫా తెప్పించుకున్నాడు.

పావురాల టపా అధికారికి దిలైలా అనే భార్యా, జీనాబ్ అనే కూతురూ ఉండేవారు. తన భర్త స్థానంలో తాను పావురాల టపా సాగించగలననీ, తనకు ఆ ఉద్యోగం ఇచ్చి, పూర్వం భర్త కిచ్చిన జీతమే తనకూ ఇమ్మని దిలైలా ఖలీఫాకు అర్జీ పెట్టుకున్నది. కాని ఈ అర్జీ బుట్ట దాఖలయింది. దిలైలా శక్తిసామర్థ్యాలు ఖలీఫా ఎరగడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే ఖలీఫా ఇద్దరు గజదొంగలను కొత్వాలు పదవికి నియమించాడు. వారిలో ఒకడి పేరు అహ్మద్, రెండోవాడి పేరు హసన్. ఇద్దరూ ఆరితేరిన దొంగలు. వారిని పట్టటానికి ఖలీఫా ఎన్నో యత్నాలు చేసి విఫలుడయాడు. దొంగతనంలో ఇంత నేర్పరితనం గల వీరిని కొత్వాళ్ళుగా నియమించటం మంచిదని ఖలీఫాకు తోచింది.

తన అర్జీని తోసివేసిన ఖలీఫా ఇద్దరు చోరులకు ఉన్నత పదవు లిచ్చాడని విని దిలైలా మండిపడింది. "ఈ దేశంలో దొంగలకూ, మోసగాళ్ళకూ గౌరవ మర్యాదలు లభించే పక్షంలో, మనమేనా

తక్కువ తిన్నవాళ్ళం? చూస్తూ వుండు, ఈ అహ్మద్, హసన్‌లు నా ముందు ఎందుకూ పనికిరారని రుజువు చేస్తాను.'' అన్నదామె తన కూతురు జీనాబ్‌తో.

నిజానికి దిలైలా వయసులో ముసలి దైనా యుక్తిలో చాలా గట్టిదే. ఆమె కూతురు జీనాబ్ కూడా తల్లికేమాత్రమూ తీసిపోయేదికాదు. తల్లి ప్రతిజ్ఞ విని ఆమె చాలా సంతోషించింది.

తన మోసాలతో బగ్దాద్‌ను మారు మోగించాలని దిలైలా పట్టుపట్టింది. ఆమె సూఫీ సన్యాసిని వేషం ధరించింది. ముఖానికి ముసుగు వేసుకున్నది, మెడ నిండా కర్రెదు తావళాలు వేసుకున్నది, చేతిలో సూఫీ బిచ్చగాళ్ళ జెండా పట్టుకుని ఆమె ఇంటి నుంచి బయలుదేరింది.

బగ్దాద్‌లో ఉండే గొప్పవారిలో ఒకరు ఖలీఫా రక్షకభట నాయకుడు, ముస్తఫా. ఆయనకు పెద్ద జీతం, బ్రహ్మాండమైన చక్కని ఇంటికి గంధపు చెక్కతో చేసిన తలుపులూ, వెండి తాళాలూ ఉండేవి. ఇన్ని ఐశ్వర్యాలకు తోడు ముస్తఫా భార్య చాలా చిన్నది, చక్కని చుక్క. ఆమె పేరు ఖాతూన్. ముస్తఫాకు భార్య అంటే ప్రాణం. అందుకనే, ఆమెవల్ల తనకు సంతానం కలగకపోయినా, ఆయన మరొక భార్యను చేసుకోలేదు. సాటి



అధికారులు దివాణానికి తమ కొడుకులను తెస్తుంటే చూసి ఆయన లోలోన కుమిలిపోయేవాడు.

ఖాతూన్ కూడా తనకు పిల్లలు కలగలేదని విచారించేది. తన భర్త పిల్లల కోసం వాచిపోతున్నాడని ఆమెకు తెలుసు. పిల్లలు కలిగేటందుకామె ఎన్నో ప్రక్రియలు చేసింది, మందులు సేవించింది. ప్రయోజనం మాత్రం లేకపోయింది.

మారువేషంలో, ''అల్లా, అల్లా!'' అని కేకలు వేస్తూ వీధుల వెంట తిరుగుతున్న దిలైలా, ముస్తఫా ఇంటి సమీపానికి వచ్చి తల ఎత్తి చూసేసరికి మేడ మీది కిటికీలో ఖాతూన్ కనిపించింది.



ఆమె అంతులేని ఆభరణాలు ధరించి కొత్త పెళ్ళికూతురులాగా వెలిగిపోతున్నది. ''ఈ పిల్లను తీసుకుపోయి ఆ నగలన్నీ కాజెయ్యకపోతే నా ప్రజ్ఞ ఏమిటి?'' అనుకున్నది దిలైలా.

దిలైలాను చూడగానే ఖాతూన్‌కు కూడా ఆశ పుట్టుకొచ్చింది. ఈ సూఫీ సన్యాసిని అనుగ్రహం సంపాదిస్తే, తనకేమైనా సంతానం కలగవచ్చుననుకుని, ఆమెను పిలుచుకు రావటానికి ఖాతూన్ దాసీని పంపింది.

దిలైలా పైకి రాగానే ఖాతూన్ ఆమె పాదాలమీద పడి తన విచారాన్ని వెలిబుచ్చింది. అంతా విని దిలైలా, ''ఇదొక పెద్ద సమస్యకాదు. ఈ నగరంలోనే సంతానసాధు వొకాయన ఉన్నాడు. ఆయనను ఒక్కసారి చూస్తివా, నీ కోరిక తీరే ఉపాయం చెబుతాడు,'' అన్నది.

ఖాతూన్ విచారంగా, ''నేనెన్నడూ, పుణ్యాలకూ, పురుళ్ళకు కూడా ఇల్లు దాటి వెళ్ళినదాన్ని కాను,'' అన్నది.

''అయితే ఇప్పుడే నా వెంట వచ్చెయ్యి. నిన్నా సాధువు దగ్గిరికి తీసుకుపోతాను. నీ భర్త తిరిగివచ్చేలోగా నువు మళ్ళీ ఇంటికి చేరుకోవచ్చు,'' అన్నది దిలైలా.

తన కోరిక ఫలిస్తుందన్న ఆనందంతో ఖాతూన్ తనకు గల మిగిలిన నగలు కూడా ధరించి దిలైలా వెంట బయలుదేరింది. వారు కొంత దూరం వెళ్ళేసరికి సిద్దీ మొహసిన్ అనేవాడి దుకాణం వచ్చింది. ఈ దుకాణదారు యువకుడు. అతనికింకా పెళ్ళికాలేదు. అతన్ని చూడగానే దిలైలాకు ఒక ఆలోచన తట్టింది. ఆమె ఖాతూన్‌ను బయటి అరుగు మీద కూచోబెట్టి మొహసిన్ దుకాణంలోకి వెళ్ళింది.

''ఆ కనిపించే అందగత్తె నా కూతురు. దానికి పెళ్ళీడు వచ్చింది. నీ వంటి బుద్ధిమంతుణ్ణి చూసి పెళ్ళి చేద్దామనివుంది. దాని తండ్రి వర్తకం చేసి చాలా సంపాదించాడు గనక నీ కేమీ లోటు

వుండబోడు. బోలెడంత కట్నమిస్తాడు,'' అన్నది దిలైలా మొహసిన్‌తో.

మొహసిన్ పరమానంద భరితుడై, ''పెళ్లి ఎప్పుడు ఖరారు చేసుకుందాం?'' అని అడిగాడు. తన వెంట వస్తే ఇప్పుడే ఖరారు చేసుకోవచ్చునన్నది దిలైలా. మొహసిన్ ఒక వెయ్యి దీనారాల సంచి కట్టు చంకన పెట్టుకుని బయలుదేరాడు.

దిలైలా ఖాతూన్‌నూ, మొహసిన్‌నూ వెంటపెట్టుకుని దారిన పోతూండగా హాజ్ ముహమ్మద్ అనే కలంకారీవాడి దుకాణం వచ్చింది. తన వెంట వున్న యిద్దరినీ దూరంగా నిలబెట్టి, దిలైలా లోపలికి వెళ్ళి, ''అయ్యా, ఆ కనిపించే యిద్దరూ నా కొడుకూ, కూతురూనూ. మా ఇల్లు మీద పడేటట్టుగా ఉంటే మరమ్మత్తు ప్రారంభించాం. మీ ఎరికను ఖాళీ ఇల్లేమయినా ఉన్నాయా? నాలుగు రోజులు మేం ఉండదలిచాం.'' అని కలంకారీతో అన్నది.

అతను ఆలోచించి, ''మా యింటి పై భాగం ఖాళీగానే వుంది. కింద నేనుంటున్నాను. తరుణంలో నీలిమందు అమ్మవచ్చే వారుండటానికి మేడమీది భాగం ఖాళీగా ఉంచాను. నాలుగు రోజులు మీకు కావలిస్తే వాడుకోండి. ఇవిగో తాళపు చెవులు.'' అన్నాడు.



దిలైలా మిగిలిన వాళ్ళను వెంటబెట్టుకుని హాజ్ ముహమ్మద్ ఇంటికి వెళ్ళి కిందిభాగం తెరిచి లోపలికి వెళ్ళమని మొహసిన్‌కు సైగ చేసింది. తరవాత ఆమె ఖాతూన్‌తో సహా పైకి వెళ్ళి, ''అమ్మాయీ, నేను చెప్పిన సాధువు ఈ మేడ కింది భాగంలోనే ఉంటాడు. నేను వెళ్ళి, ఆయనతో నీ విషయం చెప్పి ఇప్పుడే వస్తాను. ఈ లోపల నువ్వు నీ నగలన్నీ తీసి భద్రంగా మూటగట్టి ఆ సాధు దర్శనం చేసుకోవటానికి సిద్ధంగా వుండు. ఆయన దగ్గిరకి నగలతో వెళ్ళటం మహాపరాధం!'' అని కిందికి వెళ్ళిపోయింది.

మొహసిన్ ఆమెతో, "ఏమిటి, పెళ్ళి ఖరారు అనుకుందామా?" అన్నాడు.

దిలైలా పగల ఏడుపులు ఏడుస్తూ, "నేనేం చేసేది నాయనా? ఓర్వలేని దుర్మార్గులు పిల్ల మనసు కాస్తా విరిచేశారు. నీకు తామర వున్నదనీ, బొల్లి వున్నదనీ దానితో చాడీలు చెప్పారు. అది ససేమిరా నిన్ను పెళ్ళాడనంటున్నది. నీ చొక్కా విప్పదీసి కూచో. దాన్ని తీసుకు వచ్చి చూపించి పెళ్ళికి ఒప్పిస్తాను. నీ సంచీ, చొక్కా నా కిచ్చెయ్యి. పైన భద్రంగా దాస్తాను," అన్నది.

మొహసిన్ తన దీనారాల సంచీ, చొక్కా ఆమె చేతికిచ్చాడు. ఆమె మళ్ళీ పైకి వెళ్ళి ఖాతూన్‌తో, "నీ కోసం సాధువు యెదురు చూస్తున్నాడు. నీ పంట పండిందిలే. కిందికి పద. నీ నగలమూట దాచి ఇప్పుడే వస్తున్నాను," అన్నది.

ఖాతూన్ కిందికి దిగి లోపలికి వెళ్ళింది. దిలైలా ఆమె వెనకే రెండు మూటలూ పట్టుకుని వీధిలోకి వెళ్ళిపోయింది.

ఖాతూన్ కింది అంతస్థులోకి వెళ్ళి చూసింది. ఆమెకు సాధువు ఎక్కడా కనిపించలేదు గాని చొక్కా లేకుండా మొహసిన్ కనిపించి, "చూసుకో, నా వంటిమీద ఒక మచ్చ అయినా ఉన్నదేమో!" అన్నాడు. ఖాతూన్ బెదిరిపోయి మళ్ళీ మేడమీదికి పరిగెత్తి తలుపు మూసి గడియ వేసుకున్నది.

సూఫీసన్యాసిని జాడగాని, తన నగల మూట జాడ గాని ఆమెకు కనిపించలేదు.

ఈలోగా దిలైలా తాను కాజేసిన మూటలను ఒక ఎరిగున్న దుకాణంలో వుంచి కలంకారీ దుకాణానికి వెళ్ళింది.

"బాబూ, ఇల్లు చాలా సౌఖ్యంగా అమరింది. పిల్లలిద్దరూ ఆకలి అంటున్నారు. కాస్త వాళ్ళకేమైనా పట్టుకుపోతారా? ఇదుగో, ఒక దీనారం పుచ్చుకోండి. మీరు కూడా వాళ్ళకు తోడుగా ఫలహారం చెయ్యండి. నే నింటికి పోయి సామాను పట్టించుకొస్తాను," అన్నది దిలైలా.

—(ఇంకా వుంది)





# ఇద్దరు మోసగత్తెలు

## 2

హాజ్ ముహమ్మద్ తన దుకాణాన్ని ఒక పనివాడికి వప్పగించి బయలుదేరాడు. దిలైలా కూడా వెళ్ళి తాను దాచివుంచిన మూటలు తీసుకుని కొంతసేపటికి తిరిగి వచ్చింది. ఆమె పనివాడితో, ''మీ యజమానిగారు రొట్టెల దుకాణంలో వున్నారు. నిన్ను వెంటనే రమ్మన్నారు. వెళ్ళు నాయనా, నువు తిరిగి వచ్చేదాకా దుకాణం నేను చూస్తూంటాలే!'' అన్నది. పనివాడు బయటికి అడుగుపెట్టాడు.

దిలైలా దుకాణంలో ఉన్న సామానులో ఎత్తటానికి వీలైనదల్లా ఏరి ఒక పక్క పెట్టింది. దుకాణం ముందుగా మోతగాడిదను తోలుకుంటూ ఒక కుర్రవాడు వెళుతుంటే వాణ్ణి పిలిచి, ''నీకీ దుకాణదారు తెలుసుగా, బాబూ? వాడు నా కొడుకే. మా వాణ్ణి అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. ఈ సామానంతా ఊళ్ళో వాళ్ళది. వాళ్ళకి తిరిగి ఇచ్చెయ్యాలి. దీన్ని నీ గాడిద మీద వేసి నా వెంట పంపిస్తావా? ఇదుగో ఒక దీనారం పుచ్చుకో. నేను మళ్ళీ తిరిగి వచ్చేలోగా నీలిద్రావకం సీసాలూ, కర్రసామానూ పగలగొట్టెయ్యి, లేకపోతే జప్తు చేస్తారు,'' అన్నది.

గాడిదను తోలే కుర్రవాడు సరే నన్నాడు. దిలైలా సామానంతా గాడిద మీద వేసుకుని తిరిగి చూడకుండా ఇంటికి వెళ్ళిపోయింది. తల్లిని చూడగానే జీనాబ్, ''అమ్మా, ఏం చేసుకొచ్చావు?'' అని ఆత్రంగా అడిగింది.

''నలుగురి కళ్ళలో దుమ్ము కొట్టాను. ఇవి ఒక అధికారి భార్య నగలు. ఇవి ఒక దుకాణదారు సంచీ, చొక్కా. ఇవన్నీ

ఒక నిలివర్తకుడి సరుకులు. ఈ గాడిద నా లుగో వా డి ది!''. అన్నది దిలైలా గర్వంగా.

''బాగానే ఉందిగాని అమ్మా, నువ్వీక ఇల్లు కదలటానికి లేదు. వాళ్లు నలుగురూ నీ కోసం చూ స్తూం టా రు !''' అన్నది జీనాబ్.

''పిచ్చిదానా, ఇంకా అవగింజలో అరభాగం కాలేదు,'' అన్నది దిలైలా.



కలంకారీవాడు రొట్టెల దుకాణంలో రొట్టెలూ, కూరా కొంటూండగా పనివాడు వచ్చి, ఎందుకు పిలిచారని అడిగాడు. కలంకారీకి అనుమానం వేసి దుకాణానికి వచ్చి చూసేసరికి గాడిదల కుర్రవాడు దుకాణం ధ్వంసం చేస్తూ కనిపించాడు.

''ఇదేం పనిరా, నిన్ను పగలగొయ్యా!'' అన్నాడు కలంకారీ.

''మిమ్మల్ని బాకీదార్లు వదిలిపెట్టారు గద!'' అన్నాడు గాడిదల కుర్రవాడు.

వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకునేటందుకు చాలాసేపు పట్టింది. చివరకు, ''ఆ ముసలి దెక్కడ?'' అని కలంకారీవాడూ, ''నా గాడిద మాటేమిటి?'' అని గాడిద గల కుర్రవాడూ లబలబలాడ సాగారు. చుట్టూ చాలా మంది పోగయారు. అందరూ కలిసి కలంకారీ ఇంటికి వెళ్లారు.

కలంకారీవాడు కింది భాగం తలుపు తట్టేసరికి చొక్కా లేకుండా వచ్చి మొహసిన్ తలుపు తెరిచాడు. ''దొంగ గాడిదా, మీ అమ్మ ఎక్కడ?'' అని అరిచాడు కలంకారీ. ''మా అమ్మపోయి ఎంత కాలమాయెో!'' అన్నాడు మొహసిన్. వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి మరి కొంతకాలం పట్టింది. చివరకు మొహసిన్, ''ఆ ముసలిది తన కూతుర్ని నా కిస్తానని పిలుచుకు వచ్చింది. వాళ్ళు పైనే ఉన్నారు!'' అన్నాడు.

కలంకారీ మెట్లెక్కి పైకి వెళ్లి తలుపు తట్టాడు. ఖాతూన్ వచ్చి తలుపు తీసింది. ''మీ అమ్మ ఎక్కడ?'' అని అడిగాడు



వర్తకుడు. "మా అమ్మ పోయి ఎంత కాలమాయె!" అన్నది ఖాతూన్.

నలుగురూ చాలాసేపు కూడబలుక్కున్న మీదట మోసం ఎట్లా జరిగిపోయిందీ తెలియవచ్చింది. ఖాతూన్‌ను ఆమె ఇంటికి పంపేసి మిగిలిన ముగ్గురూ నగర రక్షకుడైన ఖాలిద్ వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పుకున్నారు.

ఖాలిద్ ఆశ్చర్యంతో వారు చెప్పిన విషయాలు విని, "ఈ మహా నగరంలో ఉండే ముసలమ్మలలో మిమ్మల్ని మోసం చేసినదాన్ని ఎట్లా పట్టుకోను? మీరే ఎట్లాగైనా శ్రమపడి అవిణ్ణి పట్టుకుంటే నేను తప్పక శిక్షిస్తాను," అన్నాడు.

గత్యంతరం లేక మోసపోయిన ముగ్గురూ మూడు వైపులా ముసలిదాన్ని వెతుకుతూ బయలుదేరారు.

ఈలోపల దిలైలా తాను ధరించిన సూఫీ భిక్షుకురాలి వేషం విప్పేసి, ఒక భాగ్యవంతుల పని మనిషి వేషం వేసుకుని, తన ప్రతాపంతో బగ్దాద్ పౌరులను వేపుకు తినటానికి మళ్ళీ బయలుదేరింది. ఆమె ఒక సందు చేరేసరికి అక్కడ ఒక ఇంట్లో అవాసిలూ, మేళతాళాలూ, దీపాలూ, పాటలూ, వేడుకలూ, కోలాహలమూ కనిపించింది. ఇంటి తలవాకిట ఒక బానిస మనిషి చిన్న కుర్రాణ్ణి చంకన వేసుకుని వున్నది. కుర్రాడి ఒంటి నిండా జరీ దుస్తులూ, రత్నాలు పొదిగిన ఆభరణాలూ, ముత్యాలచేర్లూ ఉన్నాయి.

ఆ ఇల్లుగలాయన బగ్దాద్ వర్తకులకు పెద్ద. ఆ రోజున ఆయన కుమార్తెకు ప్రధానం చేస్తున్నారు. చాలామంది అమ్మలక్కలు పేరంటం వచ్చారు. వర్తకుడి భార్య వచ్చినవారికి ఆతిథ్యం ఇవ్వటానికి వీలులేకుండా చిన్న కొడుకు ఆమెను పట్టుకుని మారాం చెయ్యసాగాడు. అందుచేత ఆవిడ వాణ్ణి బానిసదాని కిచ్చి, వచ్చినవాళ్ళు వెళ్ళేదాకా కాస్త ఆడిస్తూ వుండమన్నది. ఈ విషయాలన్నీ దిలైలా వీధిలోనే ఆరాతీసింది. ఆ కుర్రవాడి

వంటి మీది నగలు కాజేయాలని ఆమెకు దుర్బుద్ధి పుట్టింది.

దిలైలా జనంలో నుంచి తీసుకుని తల వాకిలి దగ్గిరికి వస్తూ, "నా ఇల్లు బంగారం కానూ, ఆలస్యం చెయ్యనేచేశాను!" అని గట్టిగా అన్నది. తరవాత ఒక చెల్లని నాణెం తీసి దానిసదాని చేతిలో పెట్టి, "మీ పాత దాది, ఉమాల్‌ఖయర్ సలాములు చెప్పవచ్చిందని అమ్మగారికి కాస్త చెప్పిరా, తల్లీ," అన్నది. దానిస నాణెం తీసుకుంటూ, "అబ్బాయిగారు అమ్మగారు కనిపిస్తే కొంగు పట్టుకుని వదలక మారాం చేస్తారు. నేనెల్లా వెళ్ళేదమ్మా?" అన్నది.

"నువు వచ్చేదాకా నేను పట్టుకుంటాలే, చిట్టితండ్రిని!" అన్నది దిలైలా. దానిస ఈ మాటలు నమ్మి, పిల్లవాణ్ణి దిలైలా కిచ్చి లోపలికి వెళ్ళిపోయింది.

వెంటనే దిలైలా పిల్లవాణ్ణి తీసుకుని ఒక నిర్మానుష్యమైన గొందిలోకి పోయి పిల్లవాడి వంటి మీద వున్న ఖరీదైన నగలూ, బట్టలూ ఊడ్చేసింది. తరవాత వాణ్ణి తీసుకుని ఒక గొప్ప రత్నవర్తకుడి దుకాణానికి వెళ్ళింది. ఆ వర్తకుడు వర్తకుల పెద్ద యొక్క కుమారుణ్ణి వెంటనే ఆనవాలుపట్టి, "మీ యజమానికి ఏం కావాలి?" అని దిలైలాను అడిగాడు.



"ఈ పిల్లవాడి అక్కకు ప్రధానం చేస్తున్నారు. ఒక జత బంగారు గాజులూ, రెండు జతల బంగారు పాంజేబులూ, వరహాల చెవికమ్మలూ, నగిషీ వడ్డాణమూ కావాలి. మొత్తం వెయ్యి దీనారాలకు తక్కువ కాకుండా సొమ్ములు ఇప్పించండి. సరుకు తీసుకుపోయి అమ్మగారికి చూపించి, నచ్చితే డబ్బు తీసుకుని ఇప్పుడే వస్తాను. కావలిస్తే అందాకా అబ్బాయి నిక్కడే వుంచి పోతాను." అన్నది దిలైలా.

"నీ యిష్టం. కాని అబ్బాయిని వుంచవలిసిన అవసరం మటుకు లేదు." అన్నాడు రత్నవర్తకుడు. దిలైలా తను

దోచిన సొమ్మంతా తీసుకుని సరాసరి ఇంటికి వెళ్ళిపోయింది.

అక్కడ వర్తకుల పెద్ద ఇంట్లో సంబరం కాస్తా శోకాల కింద మారింది. ఇంటి పెద్ద వచ్చేసరికి ఇల్లు అల్లకల్లోలంగా ఉన్నది. వర్తకుడి భార్య కొడుకు కోసం పొర్లిగింతలు పెట్టి ఏడుస్తున్నది. పిల్లవాడి జాడ ఎవరికీ తెలీదు.

వర్తకుడు చాలా సేపు వెతికించిన మీదట, పిల్లవాడు రత్నవర్తకుడి దుకాణంలో దొరికాడు.

"దొంగవెధవా, నా పిల్లవాణ్ణి ఏమని తెచ్చావు? వాడి వంటి మీది నగలూ, దుస్తులూ ఏవి?" అని వర్తకుల పెద్ద ఆగ్రహంతో అడిగాడు.

"తమ యింటికి వెయ్యి దీనారాల నగలు పంపాను, వాటి మాటేమిటి?" అని విలవిలలాడాడు రత్నవర్తకుడు.

ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవటానికి చాలాకాలం పట్టింది. ఆ సమయానికే దిలైలా మోసగించిన మొదటి ముగ్గురూ అక్కడికి వచ్చారు. అందరినీ మోసగించినది ఒక మనిషేనని తేలిపోయింది. ఒకరి కథ ఒకరికి చెప్పుకున్నారు.

"ఈ ముసలిదాని అంతు కనుక్కుంటేగాని నేను నిద్రపోను," అని వర్తకుల పెద్ద శపథం చేశాడు. రత్న వర్తకుడు మిగిలిన ముగ్గురితో, "మీతోబాటు నేను కూడా ముసలిదాన్ని పట్టటానికి వస్తాను. కాని అందరమూ కలిసి వెతికితే లాభం ఉండదు. ఎవరిదారిన వాళ్ళం వెళ్ళి చుట్టుపక్కల ప్రాంతాలన్నీ వెతుకుదాం. మధ్యాన్నానికి అందరమూ హజ్‌మసూద్ అనే మంగలి దుకాణం దగ్గిర కలుసుకుందాం," అన్నాడు.

మధ్యాన్నం వేళకు గాడిద గల కుర్రవాడు మంగలి మసూద్ దుకాణం కేసి వెళుతుండగా వాడికి దిలైలా కనిపించింది. మారువేషంలో ఉన్నప్పటికీ వాడామెను గుర్తించి, "దొరికావా దొంగపీనుగా?" అన్నాడు. —(ఇంకా వుంది)





# ఇద్దరు మోసగత్తెలు

## 3

గాడిదల కుర్రవాడు, తనను గుర్తించినప్పటికీ, ధిలైలా ఏమీ తొణకకుండా, "నువ్వనేదేమిటి, నాయనా?" అన్నది అమాయికంగా.

"నా గాడిద! నా గాడిదను నా కిచ్చి మరీ మాట్లాడు!" అన్నాడు కుర్రవాడు.

"ఎందుకట్లా అరుస్తావు? నీ గాడిదను నేనెత్తుకు పోయాననుకున్నావా? మంగలి మసూదు దగ్గిర దాచిపెట్టా. నా వెంట రా, నీ గాడిదను నీ కిప్పిస్తా," అన్నది దిలైలా. కుర్రాడామె వెంట బయలుదేరాడు. వాణ్ణి దుకాణం బయట ఉండమని, దిలైలా లోపలికి వెళ్ళి, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ మంగలి మసూదుతో, "ఇది నువ్వు కుదర్చవలిసిందే, బాబూ!" అన్నది.

"ఏమిటి, పిన్నమ్మా? అసలు విషయం చెప్పు," అన్నాడు మసూద్.

"అదుగో, నాయనా, బయట ఉన్నాడే వాడు నా కొడుకు, చచ్చేబాయిలా పడి కోలుకున్నాడు. కాని వాడి బుద్ధి పుచ్చిపోయింది. ఎప్పుడో చిన్నప్పుడు వాడికి గాడిద ఒకటి ఉండేది. దానికోసం ఇప్పుడు ఒకటే కలవరింత! వాడి పిచ్చి నువే నయం చెయ్యాలి," అన్నది దిలైలా.

ఆవిడ చేతిలో పెట్టిన దీనారం తీసుకుంటూ మసూద్, "అదెంత పని? తల గొరిగేసి నిమ్మకాయరసం అంటానంటే మూడు పూటల్లో గుణం ఇస్తుంది," అన్నాడు.

"మంచి మాటలతో వాణ్ణి పిలిచి చికిత్స చెయ్యి, నాయనా! నీ ఋణం ఉంచుకోనులే!" అన్నది దిలైలా.

మసూద్ దుకాణం బయటికి వచ్చి, కుర్రాణ్ణి చూసి, "లోపలికి రా!" అన్నాడు.

"నా గాడిద ?" అన్నాడు కుర్రాడు, కోపంగా.

"నీ గాడిద నా దగ్గిరే ఉంది. అదెక్కడికి పోతుంది? ఒక్క క్షణం లోపలికిరా!" అన్నాడు మంగలి మసూద్.

కుర్రాడు పసారాలోకి రాగానే మసూద్ నౌకర్లు వాణ్ణి పెడరెక్కలు విరిచికట్టారు. మసూద్ వాడి తల యావత్తూ మున్నగా గొరిగి, నిమ్మరసం అంటాడు. కుర్రాడు పెద్దగా కేకలు పెట్టసాగాడు.

మసూద్ చికిత్స పూర్తి చేసి తన దుకాణం లోపలికి పోయి చూసేసరికి ముసలిదాని జాడ లేకపోగా, కత్తులూ, అద్దాలూ, కత్తెరలూ, తల నూనెలూ, మర్దన తైలాలూ, అత్తరులూ, బల్లలూ, కుర్చీలూ, సమస్తమూ మాయమయాయి.

మసూద్ కుర్రాడి దగ్గిరికి వచ్చి గొంతు పట్టుకుని, "మీ అమ్మ ఎక్కడరా, పిశాచమా ?" అని అడిగాడు.

"మా అమ్మపోయి ఎంత కాలమాయె! నా గాడిద నిస్తానన్నావు. వెంటనే ఇచ్చెయ్యి," అన్నాడు కుర్రాడు.

వీళ్ళిట్లా ఘర్షణపడే సమయంలో మిగిలిన వాళ్ళు కూడా అనుకున్న ప్రకారం ఆ దుకాణం చేరుకున్నారు. జరిగినదంతా తెలుసుకున్నాక ముసలిది మరొక మోసం చేసిందని తేలింది. మంగలి మసూద్‌తో



కూడా కలిసి అందరూ ముసలిదాన్ని పట్టుకోవటానికి బయలుదేరారు.

వారు చాలా వీధులు తిరిగి ఒక చోటికి వచ్చేసరికి, గాడిదగల కుర్రవాడికి దల్లైలా మళ్ళీ కనిపించింది. వాడు చప్పున ఆమె మీద పడి పట్టుకుని, "ఇదుగో, ముసలిముండ ! ఈసారి తప్పించుకు పోనివ్వకండి !" అని అరిచాడు.

అందరూ కలిసి ఆమెను పట్టుకుని ఖాలిద్ ఇంటికి తీసుకుపోయి, అక్కడి భటులతో, "మేము ఖాలిద్‌గారి దర్శనం వెంటనే చెయ్యాలి," అన్నారు.

ఖాలిద్ నిద్రపోతున్నాడు. అయన లేచేదాకా ఆగమని భటులు మగవారి



నయిదుగుర్నీ బయట ఆవరణలో కూచోబెట్టి, దిలైలాను జనానా భాగంలో ఒక గదిలోకి పంపించారు. దిలైలా ఆ గదిలో నుంచి ఇంకా లోపలికి వెళ్ళి, ఖాలిద్ భార్య ఉండే చోటికి పోయింది. ఆమెకు సలాం చేసి, ''మా దగ్గర వున్న బానిసలను మీ భర్తగారు పన్నెండు వందల దీనారాలకు బేరం చేశారు. వారిని వప్పగించటానికి తీసుకొచ్చాను. వారు నిద్రలేచే సరికి ఏవేళ అవుతుందో ?'' అన్నది.

ఖాలిద్ భార్య, ''ఆ సంగతి నాకు తెలియదు గాని బానిసలను కొంటానని మాత్రం నాతో ఎప్పుడో అన్నారు. అయినా, మీ బానిసలెక్కడ ?'' అని అడిగింది.

''బయటే వున్నారు. కిటికీలో నుంచి చూస్తే కనిపిస్తారు. అందరూ మంచి పుటక గలవారే లెండి,'' అన్నది దిలైలా.

బయట నిలుచున్న వారినందరినీ కిటికీలో నుంచి చూసి ఖాలిద్ భార్య చాలా తృప్తి పడింది. ఆవిడ దిలైలాతో, ''డబ్బు నేనే ఇద్దును గాని, నా దగ్గిర వెయ్యి దీనారాలే ఉన్నాయే. ఏం చెయ్యను ?'' అన్నది.

''వెయ్యి చాలు గదండీ ? రెండు వందలు అదివరకే బయానాగా తీసుకున్నాగా ?'' అన్నది దిలైలా. ఆమె వెయ్యి దీనారాలూ పుచ్చుకుని సలాం చేస్తూ, ''కూచోబెట్టకుండా నా పని ముగించి చాలా పుణ్యం కట్టుకున్నారు. నాకు మా బానిసల ముఖాలు చూడటానికి చాలా బాధగా వుంది. మీరు మరోలా అనుకోక, నన్ను దయచేసి దొడ్డిదారిన పంపించెయ్యండి,'' అని కోరింది.

ఖాలిద్ నిద్ర లేచాక ఆయన భార్య, ''మొత్తానికి చాలా మంచి బేరమే చేశారే ?'' అంటూ, బానిసల సంగతి చెప్పి అభినందించింది.

అంతా విని ఖాలిద్ విస్మయంతో, ''బానిసలేమిటి? బేరమేమిటి? నేనెవరికీ బానిసల్ని కొనేందుకు బయానా ఇవ్వలేదే !'' అన్నాడు.

''అదేమిటి? నేనా ముసలావిడకు వెయ్యి దీనారాలు ఇచ్చేశాను. ఆమె వదిలివెళ్ళిన బానిసలు కింద వున్నారు,'' అన్నది ఖాలిద్ భార్య. ఖాలిద్ గబగబా కిందికి వెళ్ళి, తనకోసం వేచి వున్న దుకాణదారునూ, కలంకారీ వాణ్ణీ, రత్నాల వర్తకుణ్ణీ, మంగలి మసూద్‌నూ, గాడిదగల కుర్ర వాణ్ణీ చూసి, చాలా ఆశ్చర్యపడ్డాడు.

''మీరేనా నేను కొన్న బానిసలు?'' అని ఆయన వారినడిగాడు.

''మేము బానిసలమా? ఖలీఫా నడుగుదాం పదండి!'' అన్నారు వారు.

ఆ సమయానికే ముస్తఫా కూడా అక్కడికి వచ్చాడు. ఈ లోపుగా ఆయన తన భార్యకు ముసలిది చేసిన మోసం తెలుసుకున్నాడు. ఆయన ఖాలిద్‌తో, ''మీ నిర్వాహకం కింద ప్రతి ముసలి తొత్తూ తన ఇష్టం వచ్చిన కొంపలో జొర బడి అమాయక స్త్రీలను మోసం చెయ్య వచ్చులా కనబడుతుంది! నా భార్యకు జరిగిన మోసానికి ఏమి సంజాయిషీ ఇస్తారు?'' అని అడిగాడు.

ఖాలిద్ కంగారుతో, ''అయ్యా, ఈ ముసలిదాన్ని శిక్షించే భారం నేను మీద వేసుకుంటాను. మీ అందరికీ దాని వల్ల జరిగిన నష్టానికి పరిహారం ఇచ్చుకునే పూచీ కూడా నాదే!'' అన్నాడు.



ఆయన మిగిలిన అయిదుగురి కేసి తిరిగి,'' మీలో ముసలిదాన్ని గుర్తించగల వారెవరు?'' అని అడిగాడు.

అయిదుగురూ గుర్తించగలమన్నారు. ''మా వెంట పదిమంది భటులను పంపారంటే దాన్ని పట్టితెస్తాం కూడా!'' అన్నారు వాళ్ళు ఖాలిద్‌తో.

వారు భటులను వెంటబెట్టుకుని, కొద్ది దూరం వెళ్ళారో లేదో దిలైలా వారికెదురు పడి, వారిని చూసి పారిపోబోయింది. కాని వారు వెంట తరిమి ఆమెను పట్టు కుని, చేతులు వెనక్కు విరిచికట్టి ఖాలిద్ వద్దకు తీసుకుపోయారు. దిలైలా ఆట కట్టినట్టె కనబడింది.

ఖాలిద్ దిలైలాను దొంగతనాల విషయం ప్రశ్నించగా, ''మీరడిగేది నా కర్థం కావటం లేదు. నేను నా జన్మలో దొంగతనమన్నది చేసి ఎరగను,'' అన్నది.

అప్పటికే పొద్దుగూకింది. ఆ రోజుకు ఆమెను విచారించే వ్యవధిలేదు. ఆమె చేసిన దుండగాలు చాలా ఉన్నాయి. విచారించవలసిన సాక్షులు చాలామంది ఉన్నారు. ఆమె ఒకంతట తన నేరం ఒప్పుకునేటట్టు లేదు. అందుకని ఆ రాత్రి ఆమెను ఖైదులో చీకటి కొట్లో వేసి ఉంచినట్లయితే తెల్లవారి విచారణ జరుపుదామనుకున్నాడు ఖాలిద్. కాని జైలు అధికారి ఆమెను గురించి బాధ్యత వహించటానికి ఒప్పుకోలేదు. ''ఇంత దొంగది ఏదో ఉపాయం చేసి ఖైదు నుంచి తప్పుకుంటే నా పీకపోతుంది,'' అన్నాడాయన.

''అదీ నిజమే. విచారణ జరిపేదాకా ఈ ముసలిదాన్ని నలుగురికీ కనిపించే చోటనే ఉంచి కాపలా కాయటం మంచిది,'' అన్నాడు ఖాలిద్. ఆయన గుర్రం ఎక్కి బయలుదేరాడు. అయిదుగురు ఫిర్యాదీలూ దిలైలాను ఈడ్చుకుంటూ ఆయన వెనకగా నగరం వెలపలకు వెళ్లారు. అక్కడ బయలు ప్రదేశంలో ఆమె నొక స్తంభానికి కట్టియుంచి అయిదుగురినీ ఆమెకు కాపలా పెట్టి ఖాలిద్ నగరంలోకి వెళ్లిపోయాడు.

అయిదుగురూ ఆమె చుట్టూ కూచుని చాలాసేపు తిట్లతో కసి తీర్చుకున్నారు. కాని భోజనాలు చెయ్యగానే అందరికీ నిద్ర ముంచుకొచ్చింది. ఎందుకంటే వారికి మూడు రాత్రులుగా నిద్ర అన్నది లేదు.

అర్ధరాత్రి దాటిన చాలాసేపటికి ఆ ప్రాంతానికి ఇద్దరు వచ్చి కలుసుకున్నారు. ఒకడు నగరం వదిలిపోతున్నాడు. రెండో వాడు నగరానికి చేరుతున్నాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకోసాగారు. వారు మాట్లాడుకునే మాటలన్నీ దూరాన ఉన్న దిలైలాకు వినిపిస్తున్నాయి. —(ఇంకావుంది)





# ఇద్దరు మోసగత్తెలు

## 4

బగ్దాదు నగరానికి వస్తున్నవాడు, "బగ్దాదులో అన్నిటినీ మించి అనుభవించదగినదేమిటి ?" అని వెళ్ళేవాణ్ణి అడిగాడు.

"మీగడ పూసిన తేనె రొట్టెలు! నేనీ నగరంలో ఉన్న మూడు రోజులూ అవే తిన్నాను. ఏదైనా తనివితీరుతుంది గాని, అవి మాత్రం ఎంత తిన్నా తనివి తీరవు. ఇంకా తినాలనిపిస్తుంది," అన్నాడు వెళ్ళేవాడు.

"భేష్! ఎంత ఖర్చయినా సరే నేను ఈ నగరంలో ఉన్నన్నాళ్లూ మీగడ పూసిన తేనె రొట్టెలే తింటాను," అన్నాడు వచ్చేవాడు. వెళ్ళేవాడు వెళ్లిపోయాడు. వచ్చేవాడు దిలైలా వున్న దిక్కుగా వచ్చాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న దిలైలా అప్పటికప్పుడే ఒక యుక్తి ఆలోచించింది. ఆ యుక్తి పారితే తాను తప్పించుకు పారిపోవచ్చు. ఈ వచ్చేవాడు పరదేశీ. వాడికి తానెవరో, తన కథ ఏమిటో తెలియదు. అందుచేత వాడు సులువుగా మోసపోవచ్చు. ఇలా ఆలోచించి, దిలైలా, "నాకు వద్దు! నేను తినను!" అనటం ఆరంభించింది. అతను దగ్గరకు వచ్చి, "ఏమిటమ్మా, ఎవరు నువు? ఎందుకిక్కడ నిన్ను కట్టి ఉంచారు? ఏమిటి వద్దంటున్నావు?" అని అడిగాడు

"ఏం చెప్పేది, నాయనా? నా భర్త తేనె రొట్టెలు తయారుచేసి వాటి మీద మీగడ పూసి అమ్మి, లక్షలు గడించాడు. మొదట్లో నాకవి ఇష్టమేగాని రాను రాను మొహం మొత్తిపోయింది. మొన్న ఒకనాడు మా దుకాణానికి ఎవరో గొప్పవారు వస్తే నా భర్త నన్ను కూడా వారితోబాటు



తేనెరొట్టెలు తినమని నిర్బంధించాడు. నేను వాటిని నోట పెట్టేసరికి వాంతి కలిగినంత పని అయింది. వచ్చినవారికి అనుమానం తగిలి వాటిని తినకుండానే వెళ్లిపోయారు. నా భర్తకు డబ్బులు రాకపోవటమే గాక చేసిన సరుకంతా వృథా అయిపోయింది. ఆ మాట నిజమే, కాని నా తప్పు మాత్రం ఏమిటి? నన్ను తేనె రొట్టెలు తినమనటం నా భర్త తప్పు. అయినా, తన వ్యాపారాన్ని పాడుచేశానని నా భర్త నా మీద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి నాకు తేనె రొట్టెలు తినే శిక్ష విధించి ఇక్కడ నిర్బంధంలో ఉంచాడు. తెల్లవారుతూనే రాజభటులు తేనె రొట్టెలు తెస్తారు. అవి అందరూ చూస్తుండగా తిన్నదాకా నాకు భోజనం పెట్టరు. నా కష్టం ఏమని అడుగుతావు, నాయనా!'' అన్నది దిలైలా.

''అయ్యో, అవ్వా! పాపం, నీకెంత కష్టమొచ్చింది! ఆ కష్టం నాకైనా రాకపోయెనే?'' అన్నాడు కొత్తవాడు.

''అదేం భాగ్యం, నాయనా? నా కట్లు విడిపించితివా, నా స్థానంలో నిన్ను కట్టేస్తాను. నాలాగే నువు కూడా ముఖాన ముసుగు వేసుకో. నేనే అనుకుని నీకు తేనె రొట్టెలు, మీగడతోసహా మేపుతారు!'' అన్నది దిలైలా.

ఈ మాటలకు మోసపోయి కొత్తవాడు ఆమె కట్లు విప్పాడు. అతన్ని స్తంభానికి కట్టి, దిలైలా అక్కడవున్న గుర్రం ఎక్కి బగ్దాదుకు వెళ్ళిపోయింది.

తెల్లవారగానే ఫిర్యాదీలు అయిదుగురూ లేచి, స్తంభానికి కట్టి వున్నది దిలైలాయేననుకుని మళ్ళా తిట్లు సాగించారు. కాని స్తంభానికి కట్టి వున్న వాడు, ''ఎంతకూ తేనె రొట్టెలు రావేం?'' అని అడిగాడు. వారతని ముఖాన ఉన్న ముసుగు తొలగించి చూసి, ముసలిది మళ్లీ తమ కళ్లలో కారం కొట్టిందని తెలుసుకున్నారు.

కొద్దిసేపట్లో ఖాలిద్ స్వయంగా వచ్చాడు. జరిగినదంతా విన్నాడు. ఇది

తనవల్ల అయేపని కాదనుకున్నాడు. అందరినీ వెంటపెట్టుకుని అయన నేరుగా ఖలీఫా వద్దకే బయలుదేరాడు.

ఖలీఫా హారూన్ అల్ రషీద్ అందరి కథలూ విని, ఎవరెవరికేమేమి నష్టం జరిగిందో అదంతా తాను సరిచేస్తానని మాట ఇచ్చాడు. కాని ముందుగా ముసలిదాన్ని పట్టవలసి ఉంది.



ఆ ముసలిదాన్ని పట్టవలసిన భారాన్ని ఆయన ఖాలిద్ పైనా, ముస్తఫా పైనా వేశాడు.

ఖాలిద్ ఆ పని తనవల్ల ఎంత మాత్రం కాదన్నాడు. అయితే అందుకు మరెవరి నన్నా చూపమన్నాడు ఖలీఫా.

"కొత్త కొత్వాలు అహ్మద్ వుండగా మరొకరెందుకు? అయన పదవిలోకి వచ్చినాక ఇంతవరకెవరినీ పట్టిన జాడ లేదు. ఆ ముసలిదాన్ని పడితే అయనే పట్టాలి. ఈ పని కూడా చెయ్యలేకపోతే ఇక ఆయన ప్రజ్ఞ ఏముంది?" అన్నాడు ఖాలిద్.

ఖలీఫా అహ్మద్‌ను పిలిచి, అతనితో ముసలిదానికథ యావత్తూ చెప్పి, ఆమెను పట్టుకోమని ఆదేశించాడు. అహ్మద్ ఆ క్షణమే తన నలభైమంది భటులతో బయలుదేరాడు. ఈ భటులపైన పెత్తందారు గూని అలీ అనేవాడు. వాడు తన యజమాని అయిన అహ్మద్‌తో, "అయ్యా, నా ఉద్దేశం, మనం ఈ ముసలిదాన్ని పట్టటంలో హసన్‌గారి సహాయం కూడా తీసుకుంటే బాగుంటుందని!" అన్నాడు.

"ఓరి గూనివాడా! మన కింకొకరు సహాయం చెయ్యటమేమిట్రా? మనమేనా అంత చాతకాని వాళ్ళం? మరోసారి ఆ మాట అన్నావంటే ముక్కలు విరగగలవు, జాగ్రత్త!" అని అహ్మద్ హసన్‌కు వినిపించేలాగా అన్నాడు.

ముసలిదాన్ని పట్టేపనికి తనను కాదని ఖలీఫా అహ్మద్‌ను నియోగించినందుకే కుళ్ళిపోతున్న హసన్, అహ్మద్ ప్రగల్భాలు విని ఇంకా బాధపడ్డాడు. అతడు తనలో

"కాని! నా సహాయం లేకుండా ఈ అహ్మద్‌కు ముసలిది దొరికినప్పటి మాట కదా!" అనుకున్నాడు.

నలభైమంది భటులనూ రాజసౌధం వెలపల మైదానం మీదికి తెచ్చి, "ధీరాగ్రేసరులారా! మిమ్మల్ని నాలుగు దళాలుగా విభజిస్తాను. నాలుగు దళాలూ నగరం నాలుగు పేటలూ చక్కగా ఘాలించండి. రేపు మధ్యాహ్నానికల్లా అందరూ ముస్తఫా వీధిలో ఉన్న సరాయి వద్దకు చేరుకోండి. నేను వచ్చి మీ అనుభవాలు తెలుసుకుంటాను." అన్నాడు అహ్మద్.

నాలుగు దళాలూ నాలుగు వైపులా వెళ్ళిపోయాక అహ్మద్ కూడా స్వయంగా అచోకీ లాగటానికి బయలుదేరాడు.

తనను పట్టటానికి ఖలీఫా అహ్మద్‌ను నియోగించడం విని దిలైలా కొంచెమైనా భయపడలేదు. ఆమె తన కుమార్తెతో, "అమ్మాయీ, నన్ను పట్టగలవాడు హసన్ ఒక్కడే. ఖలీఫా అతన్ని ఈ పనికి నియోగించక పోవటం మన అదృష్టం. ఇక అహ్మద్ మాటా? అతన్ని నువ్వయినా ఏడిపించవచ్చు." అన్నది.

"అతే వాళ్ళను, నేను పోయి మోసం చేసిరానా, అమ్మా?" అన్నది జీనాబ్.

"అట్లాగే వెళ్ళిరా, తల్లీ!" అన్నది దిలైలా.

జీనాబ్ చాలా అందంగా అలంకరించుకుని, అతి పల్చని సిల్కు మేలిముసుగు వేసుకుని, ముస్తఫా వీధిలో హాజీ కరీమ్ అనేవాడు నడుపుతున్న సరాయికి వెళ్ళింది. హాజీ కరీమ్ వద్దకు పోయి రెండు సలాములు చేసి, "కొంతమంది ఆప్తమిత్రులు వస్తున్నారు. వారు మామూలు మనుషులతో సంబంధం లేకుండా కాలక్షేపం చేస్తారు. అందుచేత మీ సరాయిలో పెద్దగది ఒకరోజు అద్దెకిప్పించండి. అయిదుదీనారాలిస్తాను," అన్నది. హాజీ కరీమ్, జీనాబ్ అందచందాలు చూసి, అసలు అద్దెకూడా అవసరం లేదన్నాడు. వచ్చిన అతిథులంతా తన సారా ఖర్చుచేస్తే అదే చాలునన్నాడు. —(ఇంకావుంది)





# ఇద్దరు మోసగత్తెలు

## 5

సరాయి యజమాని హాజీకరీమ్ మాటలకు, జీనాబ్ చిన్నగా నవ్వి, "దానికేమీ చిక్కుండదు, నా మిత్రులు చెల్లికడవలే అనుకోండి," అన్నది.

ఆమె తన ఇంటినుంచి తివాసీలూ, బాలీసులూ, బల్లలూ, కంచాలూ మొదలైన సరుకంతా మోయించి తెప్పించి, పెద్ద హాలులో పరిపించింది. తిండీ తాగుడూ సిద్ధంగా పెట్టించి సరాయి వాకిట కాపువేసి నిలబడింది.

కొద్దిసేపట్లోనే గూని అలీ, అతనితో మరి తొమ్మిదిమంది భటులూ ఆర్భాటంగా అక్కడికి వచ్చి చేరారు. జీనాబ్ అతన్ని చూసి, "తమరేనా అహ్మద్?" అని అడిగింది.

"లేదు, నన్ను గూనిఅలీ అంటారు," అన్నాడు అలీ నవ్వుతూ.

"అయితే మీరంతా, వచ్చి నా ఆతిథ్యం స్వీకరించండి," అంటూ ఆమె వారిని హాలులోకి తీసుకుపోయింది. వారందరూ సారా పీపా చుట్టూ మూగి తాగుడు ప్రారంభించారు. అందులో జీనాబ్ భంగు బాగా కలపటం చేత త్వరలోనే పదిమందీ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. వారిని ఒక్కొక్కరినే ఆమె కాళ్ళుపట్టుకుని దొడ్లోకి లాక్కుపోయి, ఒకరిమీద ఒకర్ని పేర్చి పైన ఒక బట్ట కప్పి, హాలు శుభ్రంచేసి మళ్ళీ తలవాకిట నిలబడింది.

కొద్దిసేపట్లోనే మరొక పదిమంది అహ్మద్ భటులు వచ్చారు. జీనాబ్ వారిని కూడా ఈ విధంగానే ఆహ్వానించి, తాగించి మత్తు తెప్పించి, దొడ్లో పేర్చి గుడ్డకప్పింది. త్వరలోనే నలభైమందికి ఇదేగతి పట్టింది.

ఆఖరుకు గుర్రమెక్కి అహ్మద్ స్వయంగా వచ్చాడు. జీనాబ్‌ను వాకిట్లో చూసి, "ఏయ్ పిల్లా! నా భటులేమైనా కనిపించారా?" అని అడిగాడు.

"తమరు నగరకొత్వాలు అహ్మద్‌గారా? అయితే, తమ భటులకు ఈ వీధి చివర ఎవతో ముసలిది కనిపించిందట. ఆమె కోసం వెళ్ళామని తమతో మనవి చెయ్యమన్నారు! వారు దాన్ని పట్టుకుని వచ్చే లోపుగా హాలులోకి దయచేసి నా ఆతిథ్యం స్వీకరించమని మనవి," అన్నది జీనాబ్.

అహ్మద్ పరమానందంతో తాగటానికి ఉపక్రమించి, భంగు ప్రభావం వలన త్వరలోనే మొద్దులాగా పడిపోయాడు. జీనాబ్ అతని బనీను, లోపల వేసుకున్న చెడ్డీ తప్ప మిగిలిన దుస్తులూ, ఆభరణాలూ కాజేసింది. మిగిలిన నలభైమంది భటులనూ ఈ విధంగానే దోచి, దుస్తులన్నిటినీ అహ్మద్ గుర్రం మీద వేసుకుని సరాసరి తన ఇంటికి వెళ్ళిపోయింది.

అహ్మద్ అతని నలభైమంది భటులూ కూడా రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ నిద్రపోయి, మూడో నాటి ఉదయం లేచారు. మొదట వారికి తామెక్కడ ఉన్నదీ తెలియలేదు. కాని క్రమంగా స్మృతి కలిగిన కొద్దీ తమకు జరిగిన ఘోరమైన అవమానం కూడా అర్థమై భరించరాని సిగ్గు కలిగింది. దుస్తులు కూడా లేకుండా వీధిలోకి పోవటం ఎట్లాగో అహ్మద్‌కు తెలియలేదు. కాని వెళ్ళక



తప్పదు. బనీన్లతో, చెడ్డీలతో ముందు అహ్మద్ వెనక అతని నలభైమంది భటులూ సాహసించి వీధిన పడ్డారు.

వాళ్ళు కొంచెందూరం పోయేసరికల్లా అతనికి హసన్ ఎదురై, అమాయకంగా, "ఇదేమిటి, అహ్మద్? ఈ చలిగాలిలో ఇటువంటి దుస్తులతో తిరగటం ఆరోగ్యానికి మంచిదా?" అని అడిగాడు.

"విధి ఎంతవారికీ తప్పదు గదా, హసన్! నన్నొక బాలిక మోసగించింది. నువ్వేమైనా దాని జాడ ఎరుగుదువా?" అన్నాడు అహ్మద్, ఎంతో దీనంగా.

"ఆ పిల్లనూ ఎరుగుదును, దాని తల్లినీ ఎరుగుదును. వెళ్ళి పట్టుకోమంటావా?" అని అడిగాడు హసన్.

"అదెట్లా వీలవుతుంది?" అన్నాడు అహ్మద్ ఆశ్చర్యంగా.

"దానికేముంది? ఖలీఫా వద్దకు పోయి నీ వల్ల కాదని చెప్పు. ఆ పని నాకు పురమాయించమని ఖలీఫాను వేడుకో," అని హసన్ సలహా యిచ్చాడు.

అహ్మద్ అలాగే చేశాడు. ఖలీఫా హసన్‌ను పిలిపించి, "నీకి మునలిది తెలుసునా? ఆ పని నీకు ఒప్పచెప్పితే, దాన్ని పట్టుకు రాగలవా?" అని అడిగాడు.

"నేనా మునలిదాన్ని ఎరుగుదును. అది ధనలోభంతో ఈ దొంగతనాలు చేసిందనుకోను. తన ప్రతాపం ఏలిన వారికి చూపటానికే ఇలా చేసి ఉండాలి. అది దొంగిలించిన సొత్తంతా తిరిగి యిచ్చే





పరతుపై ముందుగా దానికి తమరు అభయం యిచ్చే పక్షాన దాన్ని తీసుకు వచ్చి మీ ఎదట పెట్టగలను," అన్నాడు హసన్.

ఖలీఫా అభయం యిచ్చాడు. హసన్ నేరుగా దిలైలా ఇంటికి వెళ్ళాడు. అతనికి జీనాబ్ తలుపు తెరిచింది. "మీ అమ్మను రమ్మను. ఖలీఫా పిలుస్తున్నారు. ఆయన అభయం తెచ్చాను. మీ అమ్మ ఎత్తు కొచ్చిన సామానంతా గుర్రాల మీదికి ఎత్తించు," అన్నాడు హసన్.

దిలైలా మేడ దిగి వచ్చింది. ఆమె దొంగిలించిన సామానంతా గుర్రాల మీద వేయించారు. దిలైలా ఉన్నవాటిలో మంచి దుస్తులు ధరించి ఖలీఫా దర్శనం చేసు కోవటానికి సిద్ధమయింది.

"నీ దగ్గిర వున్న సామానంతా వచ్చిందా?" అన్నాడు హసన్.

"అహ్మద్, అతని భటుల దుస్తులు తప్ప అంతా ఇచ్చేశాను. నిజం చెప్తున్నాను, ఆ దొంగతనంతో నాకేమీ సంబంధం లేదు," అన్నది దిలైలా.

"అవును, అది మరొకరి పని," అన్నాడు హసన్ నవ్వుతూ. ఇద్దరూ బయలుదేరి దర్బారుకు వచ్చారు.

ముసలిదాన్ని చూస్తూనే ఖలీఫా ఆగ్రహావేశంతో తన భటులకు ఆమె తల నరకమని ఉత్తరువిచ్చాడు. కాని హసన్ సవినయంగా అభయం మాట జ్ఞాపకం చేసిన మీదట ఖలీఫా, "నీ పేరేమిటి?" అని దిలైలాను అడిగాడు.

"పావురాల టపా నడిపిన అధికారి భార్యను. నా పేరు దిలైలా." అన్నది దిలైలా.

"నువు చాలా సమర్థురాలివిగా కనిపిస్తున్నావు! వీరినందర్నీ ఎందుకు మోసం చేశావు?" అన్నాడు ఖలీఫా.

దిలైలా ఖలీఫా ముందు సాష్టాంగపడి, "ఏలినవారు మన్నించాలి. నేను ధనాశ చేత దొంగతనాలు చేయలేదు. చౌర్యంలో ఘటికులైన అహ్మద్, హసన్‌లకు ఏలిన

వారు పెద్ద పదవులిచ్చారని విని, నేను వారికన్న ఎక్కువ శక్తులు చూపినట్టయితే నా భర్త చేస్తూ వుండిన పనిని నాకు దయ చేయిస్తారేమోననుకున్నాను,'' అన్నది.

ఖలీఫాకు దిలైలా చెప్పినదాంట్లో నిజం వున్నట్లు తోచింది. అతడు ఫిర్యాదీలకు వారి సొత్తు యిప్పించి దిలైలాతో, ''ఇప్పుడు నువ్వు కోరేదేమిటో కోరు,'' అన్నాడు.

''ఏలినవారు నాకు, నా భర్త చేసిన ఉద్యోగమూ, జీతమూ దయ చేయించాలి. నా కా పని పూర్తిగా తెలుసు. నేనూ, నా కుమార్తే కలిసి పావురాలను సాకేవాళ్ళం. వాటికి ఉత్తరాలు కట్టే వాళ్ళం. పావురాల టపా నిమిత్తం ఏలిన వారు పెద్ద దివాణం కట్టించి దానికి నలభై మంది నీగ్రో బానిసలతో, నలభై వేట కుక్కలతో కాపలా ఏర్పాటు చేయించారు. ఆ దివాణాన్ని నిర్వహించినది నేను తప్ప నా భర్త కాదు,'' అని దిలైలా మనవి చేసుకున్నది.

ఖలీఫా వెంటనే ఆజ్ఞాపత్రం తయారు చేయించి, దిలైలాను పావురాల టపా నిర్వాహకురాలుగా నియమించాడు. నీగ్రోలనూ, వేటకుక్కలనూ ఆమె పరం చేయించాడు.

దిలైలా తన ఇంటి సామానంతా పావురాల టపా దివాణానికి తరలించింది. ఆ రోజే ఆమె మగదుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ ధరించి, టపా చేయవలసిన సందేశాలు తీసుకురావటానికి రాజభవనానికి వెళ్ళింది. నలభై మంది నీగ్రోలకూ ఎర్రని జరీదుస్తులు ఏర్పాటు చేసింది. తన కొత్త భవనంలో అలంకారంగా ఉండగలందులకు నలభై ఒక్క మేకు కొట్టించి, వాటికి అహ్మద్ దుస్తులూ, గూని అలీ దుస్తులూ, మిగిలిన ముప్పైతొమ్మిది భటుల దుస్తులూ వేల గట్టింది. ఈ విధంగా దిలైలా తన పంతం నెగ్గించుకుని, తన కుమార్తె జీనాబ్‌తో సుఖంగా బతకసాగింది.

—(ఇంకా వుంది)






## 6

దిలైలా, జీనాబ్‌ల మోసాలు జరిగిన కొద్దికాలానికి కైరోనగరం నుంచి, ''పాదరసం'' అనే సార్థకనామం గల యువకుడొకడు బగ్దాద్ నగరానికి చేరుకున్నాడు. ఇతని అసలు పేరు అలీ. చాలా అందగాడు కాని గజదొంగ. ఇతని స్వస్థలం కైరో. ప్రస్తుతం కొత్వాలుగా ఉంటున్న అహ్మద్ కైరోనగరంలో పేరు మోసిన దొంగగా ఉండినప్పుడు ''పాదరసం'' అతని వద్దనే చోరవిద్య నేర్చుకున్నాడు. అహ్మద్ బగ్దాద్‌కు వచ్చి, అక్కడ కూడా దొంగగా కీర్తి సంపాదించుకుని కొత్వాలు పదవి సంపాదించిన కాలంలో కైరోలో ఈ ''పాదరసం'' దొంగల నాయకుడుగా ఉంటూ వచ్చాడు. అతను ఎన్నోసార్లు రక్షక భటులకు పట్టుబడి కూడా తప్పించుకు పోవటంచేత అతన్ని ప్రజలు, ''పాదరసం' అని పిలవసాగారు.

''పాదరసం'' అలీని, అహ్మదే బగ్దాద్‌కు పిలిపించాడు. దిలైలా విషయంలో పరాభవం తిన్ననాటినుంచీ అహ్మద్‌కు ప్రతిక్షణమూ ''పాదరసం'' జ్ఞాపకం రాసాగాడు. వాడు తనకు కుడిభుజం లాటి వాడు. వాడే తన పక్కన వుంటే తనకి పరాభవం జరిగేదికాదనుకున్నాడు అహ్మద్. అదిగాక ఇప్పుడు అహ్మద్, దిలైలా మీద స్వయంగా పగ తీర్చుకోవటానికి లేదు. ఇప్పుడామెకు తనకున్నంత హోదా వున్నది. కనుక, ఇందుకు పాదరసమే సరి అయిన వాడు.

''పాదరసం'' అలీ బగ్దాద్ నగరం చేరి నేరుగా అహ్మద్ యింటికి వెళ్ళాడు. అహ్మద్‌కు అతన్ని చూడగానే ప్రాణం



లేచివచ్చింది. ''తమ్ముడూ, నా యింట కొంతకాలం రహస్యంగా ఉన్నట్టయితే నీతో ఒక పని ఉంది. ఆ పని అయినాక నిన్ను బహిరంగంగా ఖలీఫా దగ్గిరికి తీసుకుపోయి శిఫార్సు చేసి మంచి ఉద్యోగం ఇప్పిస్తాను.'' అన్నాడు అహ్మద్ పాదరసంతో.

పాదరసం, అహ్మద్ ఇంట రెండు రోజులు గడిపాడు. ఆ తరవాత అతనికి ఇల్లు ఖైదు లాగా తోచింది. మూడోనాడు అహ్మద్ దివాణానికి వెళ్ళిపోగానే, ''పాదరసం'' ఇంటి నుంచి బయటికి జారుకున్నాడు. అతని ఉద్దేశం బగ్దాద్ నగరం నాలుగు మూలలూ తిరిగి చూసి వద్దామని.

అతను కొద్దిదూరం వెళ్ళాడో లేదో అతనికి మగ దుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ పెట్టుకుని గుర్రం మీద పోతూ ఒక ముసలిదీ, ఆమె వెంట ఎర్రజలతారు దుస్తులు ధరించిన నలభైమంది నీగ్రోలూ కనిపించారు. వారెవరో కాదు, దిలైలా, ఆమె నౌకర్లూనూ. దిలైలా ఆ ఉదయం దివాణానికి వెళ్ళి టపా చేయువలసిన వార్తలు పోగుచేసుకుని తన ఇంటికి తిరిగిపోతున్నది.

దిలైలా, ''పాదరసం'' అలీ కొత్త ముఖం చూసి అతని అందానికి ఆశ్చర్య పడింది. కాని ఆమె కళ్లకు అతని ముఖంలో తన శత్రువైన అహ్మద్ కవళికలు కొన్ని కనిపించాయి.

నిజానికి అహ్మద్ శిష్యత్వం చేయటంలో అలీ అతని చూపూ, ముఖభంగిమలూ తెలియకుండానే అలవరచుకున్నాడు. అలీ, అహ్మద్ ఇంటి వైపునుంచే వస్తూండటం కూడా దిలైలా పసికట్టింది.

ఆమె యింటికి పోతూనే తన కుమార్తె జీనాబ్‌కు తాను చూసిన యువకుణ్ణి వర్ణించి చెప్పి, ''అహ్మద్, ఈ యువకుణ్ణి పిలిపించాడని తోస్తున్నది. వాడు వీథులు వింతగా పరీక్షించటం చూస్తే యివాళో, నిన్ననో వచ్చాడనిపిస్తున్నది. మనం చాలా జాగ్రత్త మీద ఉండాలి!'' అన్నది.

జీనాబ్ తల్లి చెప్పినదంతా విని, కొంచెం సేపు ఆలోచించి, '' ఏమిటమ్మా ? హేమా హేమీలను లక్ష్యపెట్టని దానివి గడ్డాలూ, మీసాలూ సరిగారాని ఈ కుర్రాడికి దడుస్తా వేమిటి ? '' అన్నది. ఆమె అందమైన దుస్తులు వేసుకుని, కళ్లకు కొనగా కాటుక దిద్ది, మేలిముసుగు వేసుకుని, చేత సంచీ పట్టుకుని, నడిచే మెరుపు తీగెలాగా వీథిలోకి వెళ్ళింది.

ఆమె మెల్లిగా నడుచుకుంటూ కొంత దూరం వెళ్ళాక ఒక దుకాణం దగ్గిర '' పాదరసం '' కనిపించాడు. తల్లి చెప్పిన వర్ణననుబట్టి అతన్ని గుర్తుపట్టి జీనాబ్ అతన్ని తోసుకుంటూ వెళ్లి వెనక్కు తిరిగి, '' కళ్ళులేని కబోది ! '' అన్నది కోపంగా.

'' పాదరసం '' ఆమెను చూసి ఆమె అందానికి ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అతను నవ్వుతూ, '' ఆహా, ఎంత అందం ! ఎవరిదానివి ? '' అన్నాడు.

'' నే నొక వర్తకుడి కుమార్తెను, ఇంకో వర్తకుడి భార్యను. మీ ధోరణి చూస్తే ఈ ఊరికి కొత్తలాగుంది, మీ బస ఎక్కడ ? '' అని అడిగింది జీనాబ్.

అహ్మద్ విషయం రహస్యంగా ఉంచా లనే ఉద్దేశంతో పాదరసం, '' ఇంకా బస లేదు. ఎక్కడన్నా చూడాలి, '' అన్నాడు.

'' అయితే మా యింటికి రండి. మాది చాలా పెద్ద ఇల్లు. నా భర్త దుకాణానికి పోతే ఇంటి దగ్గిర నాకు తోడెవ్వరూ ఉండరు, '' అన్నది జీనాబ్.





ఆమె వెంట వెళ్ళటం క్షేమం కాదేమో నని "పాదరసం" శంకించాడు. కాని తనను ఈ నగరంలో ఎవరూ ఎరగరు గనకనూ, ఈ పిల్ల తనకు శత్రువై ఉండే అవకాశం ఏమీ కనిపించలేదు గనకనూ ఆమె వెంట వెళ్ళి ఆమె ఎటువంటిదో తెలుసుకోవాలని అతను నిశ్చయించు కున్నాడు.

జీనాబ్ అతన్ని వీథులు తిప్పి ఒక పెద్ద యింటి ముందుకు తీసుకొచ్చి, తాళపు చెవి కోసం సంచీలో వెతకనారం భించింది. ఆ ఇల్లు ఒక గొప్ప వర్తకుడిది. ప్రస్తుతం ఇంట ఎవరూ లేరు. వర్తకుడు ఉదయమే ఇల్లు తాళం వేసుకుని దుకాణానికి వెళ్ళిపోయి, రాత్రిదాకా తిరిగి రాడు. ఆ సంగతి జీనాబ్‌కు తెలుసు.

"అయ్యో, తాళం చెవి కాస్తా ఎక్కడో పడిపోయింది. ఇప్పుడు ఏం చెయ్యాలి? మీరేమైనా తాళం తీయగలరా?" అని జీనాబ్ పాదరసాన్ని అడిగింది.

"చూస్తాను," అంటూ పాదరసం అంత పెద్ద కప్పుతాళాన్ని ఇట్టె తీసేశాడు. అతను నిజంగా సమర్థుడైన దొంగేనని జీనాబ్‌కు రూఢి అయిపోయింది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. "మీరు హాలులో కూచోండి. నేను బావిలో నీళ్ళు చేది వంట చేస్తాను," అంటూ జీనాబ్ బిందె తీసుకుని దొడ్లోకి వెళ్ళింది.

కాస్సేపటికి బావి వద్ద నుంచి జీనాబ్ కెవ్వున కేక పెట్టింది. ఏం జరిగిందోనని పాదరసం పరుగెత్తుకుంటూ అక్కడికి వెళ్ళేసరికి ఆమె బావిలోకి చేదవేసి లోపలికి తొంగి చూస్తూ కనపడింది.

"ఏం జరిగింది?" అని అడిగాడు పాదరసం ఆదుర్దాగా.

"నా రవ్వల ఉంగరం! అయిదు వందల దీనారాలు పోసి నిన్ననే నా భర్త కొన్నాడు. వదులుగా ఉందని అప్పుడే చెప్పాను. అది కాస్తా బావిలో పడి పోయింది. నా భర్తకు తెలిస్తే చంపేస్తాడు!" అని జీనాబ్ విలవిలలాడింది.

"నీకేం భయం వద్దు! నేను దిగి తీస్తాను." అంటూ పాదరసం అడ్డు దూలానికి మోకు కట్టి దాని సహాయంతో బావిలోకి దిగాడు. అతను మోకు వదిలి నీళ్లలో మునగగానే జినాబ్ మోకు పైకి లాగేసి, "నిన్ను అహ్మద్ పైకి తీస్తాడులే! అందాకా అందులోనే ఉండు!" అంటూ అతని దుస్తులతో సహా ఇంటికి వెళ్లింది.

ఆ రాత్రి ఆ ఇల్లుగల వర్తకుడు పొద్దుపోయి తన నౌకరుతో సహా ఇంటికి తిరిగి వచ్చి తలవాకిలి తలుపులు దగ్గిరిగా వేసి ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. ఇల్లంతా చూసిన మీదట దొంగతనం మటుకు జరగలేదని తెలిపోయింది.

వర్తకుడి స్నానానికి నీటి కోసం సేవకుడు బావి వద్దకు పోయి బావిలో చేద వేసి నీరు తోడబోయాడు. కాని చేద విపరీతమైన బరువనిపించింది. "బాబయ్యో, దయ్యం!" అంటూ సేవకుడు గాబరాగా పరిగెత్తాడు. వర్తకుడు దీపం తీసుకుని దొడ్లోకి వెళ్ళేసరికి చేదతాడు పట్టుకుని బావిలో నుంచి ఎక్కి వస్తూ పాదరసం కనిపించాడు.

"బద్మాష్! ఎవరు నువ్వు? నా బావిలో నీకేం పని? చెప్పు! ఇప్పుడే నిన్ను భటులకు పప్పగిస్తాను!" అంటూ వర్తకుడు అరిచాడు.

"అయ్యా, ఇది ఏ దేశం? ఏ గ్రామం? నేను ఈజిప్టు దేశస్థుణ్ణి. మా నైల్ నదిలో స్నానం చేస్తూండగా ఒక సుడిగుండం నన్ను దిగలాగింది. నేను ఎంత లోతుకు పోయానో నాకే తెలీదు. మళ్ళీ నీటిపైకి తేలేసరికి మీ బావిలో ఉన్నాను!" అని పాదరసం అతి అమాయికంగా బొంకాడు.

వర్తకుడీ బొంకు నమ్మాడు.

"నాయనా! నీ అనుభవం చాలా చిత్రంగా వుంది. ఇది బగ్దాద్ నగరం. చాలా దూరం వచ్చావు. నీకు పాడిబట్టలిస్తాను కట్టుకో. ఈ రాత్రికిక్కడే భోంచేసి పడుకో, రేపు ప్రయాణమై మీ నగరానికి వెళుదువు గాని!" అన్నాడాయన.

—(ఇంకా వుంది)






## 7

మర్నాడు ఉదయం పాదరసం ఇల్లు చేరే సరికి అహ్మద్ ప్రాణాలు లేచివచ్చాయి. తన ప్రియశిష్యుడి జాడతెలియక అహ్మద్ కిందటి రాత్రి భోజనం చెయ్యలేదు. నిద్ర పోలేదు. తెల్లవారుతూనే భటుడొకణ్ణి పంపి తనసాటి కొత్వాలయిన హసన్‌ను కూడా పిలిపించి సలహా అడిగాడు. వాళ్ళు మాట్లాడుతుండగానే పాదరసం తిరిగి వచ్చాడు.

అతను తన అనుభవమంతా యిద్దరు కొత్వాలులకూ వివరంగా చెప్పాడు. హసన్ అంతా విని చిరునవ్వు నవ్వుతూ, "ఇంత పని చేయుగల చిన్నది బగ్దాదులో ఒకతే వున్నది. అది పావురాల టపా నిర్వహించే దిలైలా కూతురు జీనాబ్. ఇంతకూ దాన్ని ఏం చేద్దామని నీ ఉద్దేశం?" అని పాదరసంఅలీని అడిగాడు.

"పెళ్ళాడదామని!" అన్నాడు పాదరసం చిన్నగా నవ్వి.

"ఇంతచేసినా కూడానా?" అన్నాడు హసన్ ఆశ్చర్యంగా.

"ఇంకా యింత చేసినా ఆ పిల్లను నేను క్షమించగలను; అది నాకు భార్య అయితే నాకు జీవితంలో యింకే కోరికా లేదు," అన్నాడు పాదరసం మన స్ఫూర్తిగా.

"అంత గాఢమైన కోరిక తీరకుండా ఉండరాదు. నువ్వు కూడా మంచి అందగాడివి. మీకు జోడు సరిపోతుంది." అన్నాడు హసన్.

"మనవాడికి కాస్త సహాయం చెయ్య, హసన్!" అని అహ్మద్ అడిగాడు.

హసన్ అప్పుడే పాదరసంఅలీకి ఒక పథకం తెలిపాడు.



పాదరసం తన శరీరమంతా నల్లరంగు పూసుకుని, నీగ్రోలాగా అంగవస్త్రం చుట్టుకున్నాడు. కొంత డబ్బూ, కొంత భంగూ తీసుకుని కూరల అంగడికి వెళ్ళాడు. అక్కడ అతను దిలైలా వంటవాణ్ణి వెతికి పట్టుకుని, ''అన్నా, నేనీ నగరానికి కొత్తవాణ్ణి, సాటి నీగ్రోవు కనిపించావు. సారా దుకాణానికి వస్తావా? సఖ్యంగా తాగుదాం!'' అన్నాడు నవ్వుతూ.

దిలైలా వంటవాడు, ''నాకు క్షణం తీరిక లేదు. మా యింటికి రారాదా? అక్కడ నీకు కావలసిన అన్ని రకాల తాగుడూ, భోజనమూ కూడా పెడతాను,'' అన్నాడు.

పాదరసం కోరినది కూడా అదే. అతను ఆ నీగ్రోవాడి వెంట దిలైలా ఇంటికి వెళ్ళాడు. వంట ఇంట్లో చేరాడు. ఇంతలోనే దిలైలా, జీనాబ్ భోజనానికి వచ్చారు. వంటవాడు వారి భోజనమూ, తాగుడూ సిద్ధంచేసి ఒక్కొక్కటే తీసుకుపోయి వారి ముందు పెట్టసాగాడు. వారు అవతలికి వెళ్ళినప్పుడు పాదరసం లోటాలలో భంగు కలిపాడు.

కొద్దిసేపట్లోనే దిలైలా, జీనాబ్, నలభైమంది నీగ్రోబానిసలూ, నీగ్రోవంటవాడూ, ఆఖరుకు వేటకుక్కలు సయితం భంగు ప్రభావంతో ఒళ్ళు తెలియకుండా వున్నచోటే పడిపోవటం తటస్థించింది.

పాదరసం యథేచ్ఛగా ఇల్లంతా తిరిగి, దిలైలా అధికారరీత్యా ధరించే దుస్తులూ, బంగారుటోపీ, నీగ్రోల ఎర్రజరీ దుస్తులూ పోగుచేసి మూటగట్టుకున్నాడు. మిద్దెమీదికి వెళ్ళి గూళ్ళలో ఉన్న పావురాలన్నిటినీ పెద్దపంజరంలో పెట్టుకున్నాడు. ''ఈ పని చేసినవాడు వీరాధివీరుడు పాదరసంఅలీ తప్ప మరొకడు కాడు!'' అని చీటిమీద రాసిపెట్టి, పావురాలూ, దుస్తులూ పట్టుకుని నేరుగా అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

దిలైలాకు ఒళ్ళు తెలిసేసరికి చీకటి పడుతున్నది. ఆమె పాదరసం పెట్టి

పోయిన చీటీ చూసుకున్నది. ఇల్లంతా కలయచూసి, అతను ఖలీఫాకు సంబంధించిన సొత్తుమాత్రమే సంగ్రహించాడని తెలుసుకున్నది. దిలైలా దీర్ఘంగాఆలోచించింది. ఈ సంగతి పైకిపొక్కితే తన పరువుకూ, ఉద్యోగానికీ కూడా భంగం. పాదరసం మీద పగసాధించుకున్నా ప్రయోజనంలేదు. అతని చేత అహ్మదే ఈ పని చేయించి ఉంటాడు. అతని కాళ్ళు పట్టుకుని పోయిన సొత్తు తెచ్చుకోవటం తప్ప గత్యంతరం లేదు. అహ్మద్ మీద పగ తీర్చుకోవటానికి గాను తాను తన కూతురి ద్వారా పాదరసంఅలీకి పరాభవం చేయిస్తే దానికి ప్రతిక్రియగా అహ్మద్ ఆ పాదరసం ద్వారానే పగ తీర్చుకున్నాడు. రెంటికీ సరిపోయింది. ఇక అహ్మద్ తనతో రాజీ పడవచ్చు. "ఇప్పుడే వస్తా." అని కూతురితో చెప్పి ధిలైలా అహ్మద్ ఇంటికి వెళ్ళింది.

ఆమె అక్కడికి చేరేసరికి అహ్మద్, హసన్, పాదరసం అలీ మొదలైన వాళ్ళు కూచుని భోజనాలు చేస్తున్నారు. ఆమెను చూడగానే అహ్మద్, హసన్ లేచి తలలు వంచి సలాములుచేస్తూ, "దయచెయ్యండి, దిలైలా! మా పంక్తిన కూచోండి!" అని గౌరవంగా ఆహ్వానించారు.

వారు తింటున్నది పావురాయి మాంసమని తెలియగానే దిలైలాకు కళ్ళు చీకట్లు కమ్మాయి, తల తిరిగిపోయి నట్టయింది. ఆమె వణికిపోతున్న గొంతుతో





"అహ్మద్‌కు నా మీద ఎంత పగ ఉంటే మాత్రం ఖలీఫా ప్రాణప్రదంగా చూసుకునే టపా పావురాలను దొంగతనంగా తెప్పించి, వండించుకు తింటాడా? దొంగతనానికి మాత్రం నీతిలేదా?" అని అడిగింది.

"టపా పావురాలని తెలిస్తే వండుకు తినకపోదుమే!" అన్నాడు పాదరసం. అందరూ నవ్వారు.

హసన్ దిలైలాను అనునయిస్తూ, "నువ్వేమీ కంగారు పడకమ్మా! టపా పావురాలెక్కడికీ పోలేదు. ఖలీఫా సొత్తంతా సురక్షితంగానే ఉంది. ఒక్క చిన్న కోరిక, ఈ చిన్నవాడు కోరుతున్నాడు. దానికి నువ్వు సరే నన్నట్టయితే నీ పావురాలూ, దుస్తులూ ఈ క్షణంలో నీ పరమవుతాయి!" అన్నాడు.

"ఆ కోరిక ఏమిటో చెప్పండి. నే నసహాయురాలినని మీకు మాత్రం తెలీదూ?" అన్నది దిలైలా.

"మరేమీ లేదు. ఈ కుర్రవాడు అలీ మీ అమ్మాయి జీనాబ్‌ను చేసుకోగోరుతున్నాడు." అన్నాడు హసన్.

"అయ్యో, నాయనా! దీనికా నన్నింత బాధించారు? నేను ఒప్పుకుని ఏం లాభం? మా జీనాబ్ ఒప్పుకున్నా లాభం లేదు. ఎందుకంటే దానికి వయసు వచ్చేదాకా రక్షకుడు దాని మేనమామ, మా పెద్దన్న జురేక్. ఆయన సరేనంటే గాని ఈ పెళ్ళి కాదు. మీకు తెలియనిదేముందీ? జురేక్ కట్టైనా కంపనా కాలని కర్కోటకుడు. ఆయన్ని ఒప్పించే భారం మటుకు పూర్తిగా పాదరసం అలీది!" అన్నది దిలైలా.

జురేక్‌ను కలుసుకుని, ఆయన అనుమతి సంపాదించి, ఆ తరవాతనే జీనాబ్‌ను పెళ్ళాడటానికి పాదరసం సిద్ధపడ్డాడు.

దిలైలా తన దుస్తులూ, పావురాలూ తీసుకుని వెళ్ళిపోయింది.

దిలైలా అన్న జురేక్ కూడా ఒకప్పుడు గొప్ప దొంగే. ఆ కాలంలో అతను చేసిన దొంగతనాలకు ఆచూకీ, దర్యాప్తు, విచా

రణా అంటూ లేదు. అతను కూచున్న చోటు నుంచి కదలకుండా ఎక్కడ ఎప్పుడు ఏ దొంగతనం చెయ్యాలన్నా చేసేసేవాడు. ఇప్పుడు ముసలితనం వచ్చి, దొంగతనాలు మానేసి, చేపలు వేయించి అమ్ముకుని బతుకుతున్నాడు. కాని ఆ మనిషిలో ఇప్పటికీ ఎన్నో శక్తులున్నాయి.

జురేక్ తన దుకాణానికి జనాన్ని ఆకర్షించటాని కొక యుక్తి పన్నాడు. అతను తన దుకాణం వాకిలికి ఒక వెయ్యి దీనారాల సంచీ వేళ్ళాడగట్టి, దాన్ని ఎవరు ఎత్తుకు పొగలిగితే వాళ్ళు ఉంచుకోవచ్చునని చాటింపు వేశాడు. ఎట్లాగైనా దాన్ని కాజేద్దామని వేలసంఖ్యలో జనం దుకాణానికి వచ్చి సరుకుకొన్నారు. కాని ఆ సంచిని కాజెయ్యటం ఒక్కరివల్ల కూడా కాలేదు. ఏమంటే ఆ సంచిని ఎవరైనా తాకితే చాలు దుకాణం నిండా గంటలూ, డప్పులూ మోగుతాయి. అది వినగానే, జురేక్ దొడ్లో ఉన్నాసరే పరిగెత్తుకుంటూ వచ్చి దొంగను పట్టేస్తాడు, లేదా సీసంగుండ్లు దొంగలమీద విసురుతాడు. వాటి దెబ్బలకు కాళ్ళూ, చేతులూ విరుచుకున్న వాళ్ళు కూడా వున్నారు.

పాదరసం అలీ, జురేక్‌ను చూశాడు. తాను ఫలానా అనీ, కొత్వాల్ అహ్మద్ గారింట బస చేస్తున్నాననీ, తాను జీనాబ్‌ను పెళ్ళాడగోరుతున్నాననీ, పెళ్ళికి అనుమతించ వలసిందనీ కోరాడు. కాని ముసలి జురేక్ జీనాబ్‌తో పాదరసం పెళ్ళికి ఒప్పలేదు. అలీ, జీనాబ్‌కు తగినవాడు కాదని అతడనుకున్నాడు.

పాదరసం అలీకి, జురేక్ దీనారాల సంచి కాజెయ్యాలని, దాని ద్వారా జురేక్ అనుమతి సంపాదించి జీనాబ్‌ను పెళ్ళాడాలనీ అనిపించింది. ఇందుకుగాను అతను గర్భిణీస్త్రీలాగా వేషం వేసుకుని జురేక్ వుండే దుకాణానికి వెళ్ళాడు. చేపలు బేరం చేస్తూ నొప్పులు వచ్చినట్టు నటించాడు. జురేక్ కంగారుపడి తన భార్యను పిలవటానికి లోపలికి వెళ్ళాడు.

—(ఇంకా వుంది)






## 8

జూరేక్ భార్యను పిలిచేందుకు దుకాణం వదిలిపోగానే పాదరసం చప్పున దీనారాల సంచి మీద చెయ్యివేశాడు. వెంటనే దుకాణం నాలుగు మూలల నుంచీ డప్పుల మోతా, గంటల మోతా వినిపించింది. జూరేక్ దుకాణంలోకి వచ్చి, సంచీ వదిలి పారిపోతున్న పాదరసం మీదికి సీసం గుండు బలంగా విసిరివేశాడు. ఆ దెబ్బకు పాదరసం సొమ్మసిల్లి వీథిలో పడిపోయాడు. తరవాత కుంటుతూ అహ్మద్ ఇల్లు చేరాడు.

ఇదంతా చూస్తున్న వాళ్ళు జూరేక్‌ను నానాతిట్లూ తిట్టారు. ''నీ పాపిష్ఠి డబ్బుతో అందరికీ ఆశ చూపింది చాలక, నిండు మాలాల్ని సీసం గుండు పెట్టి కొడతావా ? నువు మనిషివా, పశువ్వా ?'' అన్నారు వాళ్ళు.

''ఈ వేదాంతాలకేం లే ?'' అన్నాడు జూరేక్ నిర్లక్ష్యంగా.

దెబ్బనుంచి కాస్త కోలుకోగానే పాదరసం జూరేక్ దుకాణానికి మళ్ళీ బయలుదేరాడు. అతను జూరేక్ చేతిలో చావటానికైనా సిద్ధపడ్డాడుగాని, జీనాబ్‌ను పెళ్ళాడే యత్నం మానటానికి ఒప్పుకోలేదు.

ఈసారి పాదరసం ఒక నౌకరు వేషం వేసుకుని జూరేక్ దుకాణానికి సంచీ పట్టుకెళ్ళి, ''వేయించిన చేపలు వేడివేడిగా ఇప్పించండి,'' అని అడిగాడు.

''వేడిగా కావాలంటే నిప్పు చేసిన దాకా ఆగు !'' అంటూ జూరేక్ అవతలికి వెళ్ళాడు. వెంటనే పాదరసం డబ్బు సంచీ పట్టుకున్నాడు. మళ్ళీ గంటలూ, డప్పులూ మోగాయి. ఒక్క దూకున జూరేక్ దుకాణంలో వచ్చిపడి, ''నీవేషం



నేను కనిపెట్టలేదనుకున్నావుట్రా?'' అంటూ సీసం గుండు పాదరసం తలకి గురిపెట్టి బలంకొద్దీ విసిరాడు. పాదరసం సమయానికి వంగాడు. సీసంగుండు నేరుగా వీథిలోకి వెళ్ళి ఒక నౌకరు తీసుకుపోతున్న పెరుగుముంతకు తగిలింది. పెరుగంతా చిందీ వెనకే వస్తున్న ఒకానొక కాదీ ముఖానా, గడ్డంమీదా పడింది.

దగ్గర ఉన్నవాళ్ళు జూరేక్‌తో, ''కాదీగారు నీ పాపిష్టి డబ్బుకు వడ్డీ లెక్కకట్టి వడ్డించకపోతే చూడు!'' అన్నారు.

రెండు ప్రయత్నాలు విఫలమైనా పాదరసం ఆశ విడిచిపెట్టలేదు. అతను మూడోసారి పాములవాడి వేషం వేసుకుని, బుట్టలో మూడు తాచులు పెట్టుకుని జూరేక్ దుకాణం ముందు వాటిని ఆడించసాగాడు. ఆడిస్తున్నట్టే ఆడిస్తూ పాదరసం ఒక కోడెతాచును, దుకాణంలోకి, జూరేక్ కాళ్ళముందు పడేట్టు విసిరివేశాడు. జూరేక్ హడలెత్తి అవతలికి పారిపోయాడు. ఆ గందరగోళంలో పాదరసం డబ్బు సంచీని అందుకున్నాడు. కాని మరుక్షణంలోనే జూరేక్ తిరిగివచ్చి, ఒక సీసం గుండుతో పాముతల చితకగొట్టి, మరో గుండు పాదరసంవేపు విసిరాడు. గుండు వెళ్ళి వీథివెంట పోయే ముసలిదానికి తగిలి, ఆమెను తక్షణమే పరలోకానికి పంపేసింది.

చుట్టుపక్కలవాళ్ళంతా జూరేక్‌ను తన్నబోయారు. వారికి భయపడి జూరేక్ మండిగంలో నుంచి ఆ సంచీ తీసేసి, వంట ఇంట్లో గొయ్యి తవ్వి, అందులో దాన్ని పూడ్చేశాడు.

''సంచి దించనే దించావు. ఆ డబ్బు పిల్లవాడి పుట్టినరోజు పండక్కు ఖర్చు చేద్దాం,'' అన్నది జూరేక్ భార్య. కాని జూరేక్ వినలేదు. ఆ రాత్రి జూరేక్‌కు ఒక కల వచ్చింది. ఏదో పక్షి తన వంట ఇంట్లో ముక్కుతో తవ్వి డబ్బుసంచీ పైకి లాగుతున్నదిట. జూరేక్ కంగారుపడుతూ లేచి భార్యతో, ''ఒసే, ఏదో పక్షి వంట ఇంట్లో తవ్వుతున్నది. వెళ్ళిచూడవే!'' అన్నాడు.



జూరేక్ భార్య దీపం తీసుకుని వంట ఇంట్లోకి వెళ్ళింది. అక్కడ పక్షి అయితే లేదుగాని, కిటికీలోనుంచి ఎవరో దూకి పోవటం మటుకు ఆమె కళ్ళపడింది. ఆ మనిషిచేతిలో డబ్బుసంచీ ఉంది!

అది కాజేసినవాడు పాదరసం అలియే. అతను అక్కడే ఉండి, సంచీని వంట ఇంట్లో దాయటం గమనించి, రాత్రి వచ్చి దాన్ని కాస్తా సంగ్రహించాడు.

"నీ నోరుబడ! డబ్బు పిల్లవాడి పుట్టిన రోజుకు ఖర్చుచెయ్యమంటె లేదన్నావు! ఇప్పుడది కాస్తా దొంగవాడు దోచుకు పోయాడు!" అని జూరేక్ భార్య ఏడిచింది.

"అదెక్కడికి పోతుందే? ఇప్పుడు తీసుకురానా?" అంటూ జూరేక్ హడా విడిగా అక్కడినుంచి బయలుదేరాడు.

"సంచీ లేకుండా వచ్చావో, నీకు తలుపు కూడా తెరవను!" అన్నది భార్య.

ఈ సంచీ కోసం మూడు యత్నాలు చేసిన దెవరో జూరేక్‌కు బాగా తెలుసు. పాదరసం కొత్వాలు అహ్మద్ ఇంట్లో ఉంటున్నట్టు కూడా ఆయన ఎరుగు. అందుచేత ఆయన అడ్డదార్ల వెంబడి ముందుగా అహ్మద్ ఇల్లు చేరి, మారు తాళంతో బయటి తలుపు తెరిచి, దాని వెనక్కు వెళ్ళి మూసి, పాదరసం కోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

ఇంతలో పాదరసం వచ్చి తలుపు తట్టాడు. జూరేక్ అహ్మద్ గొంతుతో, "పాద రసం, నువేనా?.... సంచి తెచ్చావా?.... ఏదీ? తలుపు కిందుగా లోపలికి తొయ్యి! నేనూ, హసన్ పందెం వేసుకున్నాంలే! అంతా చెబుతా!" అన్నాడు.

ఆ మాట్లాడేది అహ్మదే ననుకుని పాద రసం సంచీని తలుపు కిందుగా లోపలికి తోశాడు. జూరేక్ అది తీసుకుని అహ్మద్ ఇంటి మెట్లెక్కి మిద్దె మీదికి పోయి, ఆ మిద్దె మీది నుంచి పక్క మిద్దె మీదికి దాటి, అవతలి ఇంటి మెట్లు దిగి, ఆ యింటి తలుపు తెరుచుకుని వీధి ఎక్కి, పరమా నందంతో ఇంటివేపు సాగాడు.

పాదరసం ఒకటి రెండుసార్లు తలుపు తట్టి చూశాడు. ఏ అలికిడీ లేదు. జూరేక్ తనను మోసగించాడా అనుకున్నాడు. వేగంగా అడ్డదార్ల వెంబడి పరిగెత్తి జూరేక్ ఇల్లు చేరాడు, లోపలికి ప్రవేశించాడు. మిద్దెమీద పడకగదిలో జూరేక్ భార్య పిల్ల వాణ్ణి పెట్టుకుని నిద్రపోతున్నది. పాదరసం ఆమె లేచేలోపల చేతులూ, కాళ్ళూ కట్టేశాడు. కుర్రవాణ్ణి ఒక తట్టలో పడుకోబెట్టి జూరేక్ కోసం తలవాకిట వేచి ఉన్నాడు.

ఇంతలో జూరేక్ వచ్చి తలుపుతట్టాడు. పాదరసం జూరేక్ భార్యగొంతుతో, "సంచీ దొరికిందా ?" అని అడిగాడు.

"ఇదుగో. తెచ్చాను." అన్నాడు జూరేక్.

"బుట్టలో పెట్టు. డబ్బు లెక్కచూసుకునిగాని తలుపు తెరవను." అన్నాడు పాదరసం, జూరేక్ భార్యగొంతుతో. అతను ఒక చిన్న బుట్టకు తాడు కట్టి దించి, సంచీ పైకి చేదుకున్నాడు. తరవాత సంచీ తీసుకుని, పిల్లవాడున్న తట్ట ఎత్తుకుని అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఎంతసేపటికీ తలుపు తెరుచుకోకపోవటం చూసి జూరేక్ తలుపుమీద బాదనారంభించాడు. చుట్టుపక్కల వాళ్ళంతా చేరారు. ఎన్ని కేకలు పెట్టినా అతీ గతీ లేదు. చివరకు అందరూ కలిసి తలుపులు పడదోసి లోపలికి వెళ్ళిచూస్తే జూరేక్ భార్య మంచానికి కట్టేసి ఉంది. సంచీ జాడలేదు సరికదా, పిల్లవాడు కూడాలేడు!

జూరేక్ తన భార్య కట్లు విప్పి జరిగినదంతా తెలుసుకుని, జుట్టు పీక్కుని, అప్పుడే అహ్మద్ ఇంటికి వెళ్ళి దబదబా తలుపుతట్టాడు. అప్పటికే తెల్లవారుతున్నది. లోపల అంతా మేలుకునే ఉన్నారు. జూరేక్ పాదరసం అలీని చూస్తూనే, "డబ్బుసంచీ నువ్వు సంపాదించుకున్నావనుకుంటాను. నీకు పుణ్యం ఉంటుంది. నా పిల్లవాణ్ణిన్నా నాకిచ్చెయ్యి!" అని వేడుకున్నాడు.

(ముగింపు వచ్చే సంచికలో)






## 9

జొరేక్ విచారం చూసి, హసన్ చిన్నగా నవ్వి, "తొందరపడకండి. మీకు డబ్బు సంచీ దొరుకుతుంది, పిల్లవాడూ దొరుకుతాడు. కాస్త మా వాడికీ, మీ మేనగోడలు జీనాబ్‌కూ పెళ్ళిముహూర్తం పెట్టించి మరీ వెళ్ళండి!" అన్నాడు.

"జీనాబ్‌ను అలీకిచ్చి చెయ్యటానికి నాకేనాడూ అభ్యంతరం లేదు. కాని, జీనాబ్ సంతలో కొన్నట్టు కొనటానికి గొర్రెపిల్ల కాదు. దాన్ని పెళ్ళాడేవాడు భరణం ఇవ్వవలసి వుంటుంది," అన్నాడు జురేక్.

"తప్పక ఇస్తాను, ఏమివ్వాలి?" అన్నాడు పాదరసం ఆత్రంగా.

"అజరయ్యా కూతురు కమర్ దగ్గిర వుండే బంగారు దుప్పటీ, బంగారు శిరోభరణమూ, బంగారు వడ్డాణమూ, బంగారు చడావులూ తెచ్చిన వాణ్ణి చేసుకోవాలని జీనాబ్ అభిప్రాయం. అవి నువ్వు తెచ్చి ఇవ్వగలిగితే పెళ్ళికి నా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు జురేక్.

"తెస్తాను," అన్నాడు పాదరసం అలీ.

జురేక్ తన పిల్లవాణ్ణీ, డబ్బు సంచీని తీసుకు వెళ్ళిపోయాక, హసన్ పాదరసంతో, "నీ కేమైనా పిచ్చా ఏమిటి? ఇటువంటి పని ఎందుకు మీద వేసుకున్నావు? అజరయ్యా మంత్రాలూ, చేతబడులూ నేర్చినవాడు. వాడికి భూత పిశాచాలు పలుకుతాయి. వాడు బగ్దాద్ నగరం గోడల బయట, బంగారు వెండి ఇటుకలతో కట్టిన భవంతిలో వుంటాడు. రాత్రిపూట వాడు యింట్లో వున్నప్పుడు తప్ప ఆ ఇల్లెవరికీ కనిపించదు. పగలల్లా వాడు నగరంలో వడ్డీవ్యాపారం చేస్తాడు.

రాత్రివేళ ఇంటికివెళ్ళి కిటికీలో నిలబడి, తన కూతురి బంగారు దుప్పటి ఒక బంగారు పళ్ళెంలో పెట్టి పట్టుకుని, "ఇరాక్, ఇరాన్, అరేబియాలలో గల ఏ గజదొంగ అయినా సరే దీన్ని కాజెయ్యండి, చూస్తాం," అంటాడు. ఎంతమంది దొంగలో ఆ దుప్పటి కాజెయ్యటానికి యత్నించి నాశనమైపోయారు. వారిలాగే నిన్నుకూడా నాశనం చేయించాలనే దురుద్దేశంతోనే జరేక్ నిన్ను ఉసికొల్పాడు. ఈ పని నీ వల్ల అయేది మాత్రం కాదు!" అన్నాడు.

"ఏమన్నానో అన్నాను. జీనాబ్‌ను పెళ్ళికూతుర్ని చేసినప్పుడు ఆ బంగారు దుప్పటి కప్పి, బంగారు శిరోభరణం పెట్టి, బంగారు వడ్డాణం చుట్టి, బంగారు చడావులు తొడిగి మరీ పెళ్ళాడతాను!" అన్నాడు పాదరసం ధైర్యంగా.

వాణ్ణి ఎవరూ ఆపలేకపోయారు. వాడు అప్పుడే బయలుదేరి అజరయ్య దుకాణానికి వెళ్ళాడు. అజరయ్య బంగారాన్ని సంచులతో తూయించి, గాడిద మీద వేయిస్తున్నాడు. అజరయ్య దుకాణం మూసి గాడిదమీద సవారీ అయి ఇంటికి బయలుదేరేదాకా దూరంగా వేచివుండి, అలీ అతన్ని వెంబడిస్తూ ఊరి వెలపలకు వెళ్ళాడు.

అజరయ్య ఒక చోటికి వచ్చి, సంచీలో నుంచి ఇంత ఇసుక తీసి, మంత్రించి, గాలిలో చల్లాడు. వెంటనే ఎదురుగా ఒక



భవనం ప్రత్యక్షమయింది. ఆ భవనం బంగారు ఇటుకలతో, వెండి ఇటుకలతో కట్టివున్నది. అజరయ్యా గాడిదమీద భవనంలో ప్రవేశించాడు. మరి కొంత సేపటికి ఆయన కిటికీ తెరిచి, చేతిలో బంగారు పళ్ళెంలో బంగారు దుప్పటి పెట్టి పట్టుకుని నిలబడి, ''ఇరాక్, ఇరాన్ అరేబియాలలో గల గజదొంగల్లారా! చాతనయితే ఈ నా కూతురి సొత్తు దొంగిలించి ఆమెను పెళ్ళాడండి!'' అన్నాడు.

అజరయ్యాను మంచిగా అడిగి ఆ వస్తువులను బహుమానంగా పుచ్చుకోవాలని అలీకి తోచింది. ''అయ్యా, తమతో ఒక్కసారి మాట్లాడాలి.'' అన్నాడతను అజరయ్యాతో.

''ఎవరు నువ్వు? పైకి రా!'' అన్నాడు అజరయ్యా.

పాదరసం పైకి వెళ్ళి అజరయ్యాతో తన అవసరం గురించి చెప్పాడు. అజరయ్యా అంతా విని గట్టిగా నవ్వి, పాదరసం చెయ్యి పరీక్షించి. ''నీకు ప్రాణంమీద ఆశ వుంటె, నా సలహా తీసుకుని, ఈ ప్రయత్నం మానుకో. ఎవరో నీ కీడు గోరి నిన్ని పనికి పురికొల్పారు. నా ఆయుర్దాయం కంటె నీకు ఎక్కువ వున్నది. లేకపోతే నిన్ను ఈ క్షణాన చంపివుందును!'' అన్నాడు.

అలీ మండిపడి, కత్తిదూసి, ''దుర్మార్గుడా! నేను కోరినది ఇవ్వకపోతే నిన్ని క్షణంలో చంపేస్తాను!'' అన్నాడు.





"ఆ చెయ్యి పడిపోవాలి!" అన్నాడు అజరయ్యి. మరుక్షణం పాదరసం కుడి చెయ్యి చచ్చుపడిపోయింది. పాదరసం కత్తిని ఎడమచేతిలోకి తీసుకున్నాడు. కాని అజరయ్యి మహిమవల్ల అదీ పడిపోయింది.

"ఇప్పటికైనా నీ ప్రయత్నం మానుకుంటావా?" అన్నాడు అజరయ్యి.

"నాకా దుప్పటీ అవీ కావాలి!" అన్నాడు పాదరసం.

"అందుకు ఒకటే మార్గం! గాడిదవై వాటిని మొయ్యి!" అంటూ అజరయ్యి పాదరసం మీద నీళ్ళుమంత్రించి చల్లాడు. వెంటనే అలీ కాస్తా గాడిద అయిపోయాడు.

మర్నాడు అజరయ్యి దుకాణానికి పాదరసాన్ని తోలుకుపోయాడు. ఆ రోజు సాయంకాలం ఇంటికి వచ్చాక అజరయ్యి అలీని మళ్ళీ మనిషిని చేసి, "ఎందుకు చెడతావు? నా సలహా విని వెళ్ళిపో, లేకపోతే ఇంకా హీనమైన జంతువుగా మార్చగలను." అన్నాడు. అలీ ఆ మాటలేవీ వినిపించుకోక అజరయ్యి మీదికి వురికాడు. అజరయ్యి అతన్ని ఎలుగుబంటిగా మార్చేశాడు.

మర్నాడు అజరయ్యి కూతురు కమర్ తండ్రితో, "నాన్నా, ఈ అబ్బాయి నన్ను పెళ్ళాడతాడేమో అడుగు." అన్నది.

"నువే అడుగు." అంటూ అజరయ్యి కోపంగా తన గదిలోకి వెళ్ళాడు.

"నీకు కావలసింది నేనా, నా వస్తువులా?" అని కమర్ పాదరసాన్ని ప్రశ్నించింది.

"దిలైలా కూతురు జీనాబ్ అనే అందగత్తెకు భరణంగా ఇవ్వటానికి నీ వస్తువులే నాకు కావాలి." అన్నాడు పాదరసం అలీ.

"వాడి మనసు మారదు, చూశావా?" అన్నాడు అజరయ్యి కూతురితో. తరవాత అలీ మీద నీళ్ళుచల్లి కోతిని చేశాడు.

ఆ రాత్రి కమర్ ఒక నిశ్చయానికి వచ్చేసింది. ఆమె పాదరసం అలీకి

సహాయం చెయ్యా నిశ్చయించింది. అతను తనను పెళ్ళాడకపోయినా అతని సుఖం కోసం తన వస్తువులు ఇచ్చెయ్యా దలచింది. అందుచేత ఆమె ఆ రాత్రి, తన తండ్రితో శతపోరి అతణ్ణి ఒప్పించింది. తరవాత తన వస్తువులన్నీ బంగారు పళ్ళెంలో పెట్టుకుని, కోతి రూపంలో వున్న పాదరసం దగ్గిరికి పోయి, అతన్ని మనిషిగా చేసి, "అలీ, ఇవి తీసుకో! నువు కోరే జీనాబ్‌ను పెళ్ళాడు," అన్నది.

పాదరసం అలీకి కమర్ పట్ల చాలా అభిమానం కలిగింది. అతను ఆమెను వెంటబెట్టుకుని హసన్, అహ్మద్‌ల వద్దకు వెళ్ళాడు. "నువు జీనాబ్‌ను పెళ్ళాడిన తరవాత కమర్‌ను కూడా పెళ్ళాడటం ఉచితం. ఈమె తండ్రి కీమె ఒక్కతే కుమార్తె గనక అతని ఆస్తి కూడా అతడి తదనంతరం చట్టం ప్రకారం నీకే దక్కుతుంది," అని వారు అన్నారు.

తరవాత వాళ్లు దిలైలానూ, జీనాబ్‌నూ, జురేక్‌నూ పిలిపించారు. జురేక్ సాక్షిగా పాదరసం జీనాబ్‌కు కమర్ బంగారు దుప్పటీ, శిరోభరణమూ, వడ్డాణమూ, చడావులూ భరణంగా ఇచ్చాడు. జురేక్, తన మేనకోడలైన జీనాబ్ పాదరసం అలీని పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు.

ఈ భరణం సంపాదించటానికి పాదరసం పడిన కష్టాలను గురించి విని జీనాబ్, అలీ కమర్‌ను పెళ్ళాడటానికి ఆమోదించింది. పాదరసం అలీకీ, జీనాబ్‌కూ పెళ్లి అతివైభవంగా జరిగింది.

తరవాత కొద్ది రోజులకు పాదరసం ఖలీఫా దర్శనం చేసుకుని తనను కొలువులో ఉంచుకోమని అర్జీ పెట్టుకున్నాడు. ఆ అర్జీని ఇద్దరు కొత్వాళ్ళూ, పావురాల టపా నిర్వాహకురాలూ బలపరచటం వల్ల ఖలీఫా పాదరసం అలీని రాజభటులకు సర్దారుగా నియమించాడు. నెలకు వెయ్యి దీనారాలు వేతనం తీసుకుంటూ పాదరసం జీనాబ్, కమర్‌లతో సుఖంగా కాలం గడిపాడు.

—(అయిపోయింది)

